

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

శ్రీ మత్పర దేవతాయై నమః

# పీఠిక



అసలు దీనికి నుపోద్ఘాతమే వ్రాయనక్కఱ లేదు. ఈవార్ధక్యములోఁ గాలక్షేపమునకై గిలుకు వెఱ్ఱిమొఱ్ఱికవిత్వములో నియ్యదియొకటి. ఈకథ పురాణప్రసిద్ధమని శిష్యుఁడు మల్లికార్జునశాస్త్రిగారు

స్వవిరచిత సత్యవత్యుపాఖ్యానమున

వ్రాసియున్నారు. దీనిరచన ముగియువఱకును నా కీవిషయము (వేఱొక రీగాథను మున్నె కబ్బ మొనరించిరని) తెలియదు. అందుకే యీపరిశ్రమ. ఆయీమాట యథార్థమే యైనను దీనినెవరును విశ్వసింపరు. విశ్వసింపకున్నను నిజ మగుటచే వ్రాసితిని.

"నమ్మిన నమ్మకున్న నది నావశమా ?"

ఆయీచరిత్రమును పైనుదాహరించిన పేరితో మల్లికార్జునశాస్త్రిగారు నేను బందరులో నున్నకాలమున రచించి నాకు వినిచి సంస్కరింపఁజేసికొన్నట్లు విస్పష్టముగా నాగ్రంథమందే యున్నది. పైఁగా

శైబ్యోపాధ్యాయికను

జెల్పుపద్యమేకాక వేఱొకవాక్యముగూడ నందుఁ గలదు. చూడుఁడు.

(1) తిరుపతివేంకటేశ్వరులు సంస్కృతగురువులు.

(2) చ. నిరుపమమై సమస్తధరణీవరసంసదుపార్జితోజ్జ్వల
ద్విరుదకమై విపక్షకుకవిక్షితిభృత్పటలీశతారవి
స్ఫురణకమై యశేషబుధపుంగవమానితమై తనర్చుశ్రీ
తిరుపతివేంకటేశ్వరుల దిగ్విజయంబు జయంబు గూర్చుతన్.

సుమారిరువదియైదేండ్లనాఁడీగ్రంథము నేనుజూచియేయుండియు నిప్పటి కింకను అంతో యింతో ధారణాశక్తి కల్గియుండియు బొత్తిగా

నీవిషయము స్మృతికిఁ దగులకయే యీకథనే ప్రతిపాద్యముగాఁ బెట్టుకొని నేనీషా త్తమును రచించితిని. నమ్మినను నమ్మకున్నను సత్య మిదియే. ఇఁక నొకమాట వ్రాయుదును. ఇదివఱలో నడిచినవిషయముగా నుండ నిచోఁ గడుంగడు వేగముగా లేఖిని పరువెత్తును గాని నడిచిన విషయమునందు నాకు లేశమును గలము నడువదు. ఒకరు రచించినవిషయమునే పుచ్చుకొని రచించుటకూడ నాకు బొత్తిగా రుచింపని పనియే.

## దే వీ భా గ వ త ము

మాకన్నఁ బూర్వులగు కవులు రచించియున్నా రనుసంగతి తెలియకయే మేము రచన కుపక్రమించితిమి. రచన ముగిసినపిమ్మట మాకన్న మున్ను కొంద ఱద్దాని ననువదించిరని తెలిసినది. మృచ్ఛకటిక, ముద్రారాక్షసములోనగు కొన్నిటి ననువదించుటకుఁ గారణము శ్రీ శ్రీ శ్రీ. శ్రీ. లు పోలవరపు జమీందారుగారి బలాత్కృతిగాని మాచాపల్యము కాదు. అవికూడ నుచ్ఛిష్టములేకదా ?

## లక్షణా పరిణయము

కూడ నప్పటికే యితరవిరచిత మున్నదని యెఱిఁగియు రచించుటకు నాకృతిని గృతి నందిన శ్రీ తాడికొండ రామారెడ్డిగారి కోరికయే కారణము గాని మా చాపల్యము కాదు. ఇతరులు రచించినదానినే

## పునః పాకము

చేయుటలో నున్నచి క్కేట్టిదనఁగా? ఆ రచనకును ఈ రచనకును ఇటీవలివారు తారతమ్యపరీక్ష కుపక్రమింతురు. ప్రాచీనరచనయందున్న గౌరవము నవీనమం దెవ్వరికిని నుండదు. ఆకారణముచేతనే కదా

"శ్లో॥ పురాణ మిత్యేవ న సాధు సర్వమ్"

అని కవికులగురువైన కాళిదాసుకూడ వర్తమానకవులనుగూర్చి విన్నవింపవలసి వచ్చినది. తారతమ్యచర్చలో నొకరు మనరచన నధఃకరించుట తటస్థింపవచ్చును. అట్టిచో వారితో మనకు వివాదము ప్రసంగును. అయ్యది అంతలో నుండునా ? వారిని వీరో, వీరిని వారో దూషించుట

ప్రసక్తించును. అయ్యది ప్రాజ్ఞలోకమునకు రుచించదు. ఏమిగతి ? దానికి జంకి విద్వల్లోకము తారతమ్యచర్చకు దిగకుండునా? అది యనివార్యము. పూర్వకవివిరచితమైన కథావస్తువునే ప్రతిపాద్యముగాఁ బెట్టుకొని పునఃపాక మొనర్చి మెప్పందినవా రొక్క కంకంటి పాపరాజుగారు తప్ప నా యెఱిఁగినంతలో వేఱొకరు కనుపట్టరు. ఆయన ధన్యులు. ఎవరియదృష్ట మెవరికి వచ్చెడిని—"పుణ్యై ర్యశో లభ్యతే". అందుచేత వేఱొకరు చేసిన రచనను వదలుకొని కవి యేదో క్రొత్తదానిని కథావస్తువుగాఁ బెట్టుకోవలెను. అట్లు పెట్టుకొన్నచో నితరుల రచనకును దన రచనకును దారతమ్యప్రసక్తి కంతగా నవసరము కల్గదు. ఇఁక నొక విశేషము. తనయుద్యమము దురుద్దేశ ప్రయుక్తము గాకున్నను పాఠకలోకము పూర్వకవి నధఃకరించుటకుఁగా నిది మొదలు వెట్టినట్లు భావించి పంతగించి తారతమ్యచర్చ కుపక్రమింపవచ్చును. అపుడు వారితో మన మెంత కంఠశోష పడినను ప్రయోజన ముండదు. వృథా. నాకు వీలయినంతలో మంచో చెడ్డో క్రొత్త మార్గమున రచన సాగించుకొనుటయే అభిమతమైనను సమకాలీనుఁడు అందులో శిష్యుఁడు రచించినగాథనే ప్రస్తుతము కథావస్తువుగాఁ గైకొనుట తటస్థించినది. దీనిని నేను సమర్థింపఁజాలను. ఇయ్యది మా యింట

ధర్మాంగదచరిత్ర—పాముపాట

అను పేరితో నాఁడువాండ్రపాటల పుస్తకములలో నున్న యొకానొక పొత్తములోని కథ. గంజాం డి॥ బారువ అను నూర నివసించు నొక క్షత్రియ గృహస్థు దీనిని జంగముకథగా రచించెను. ధర్మాంగదుఁడు కథానాయకునకుఁ దండ్రి. అట్టిచో నతని పేరితో దీనిం బ్రకటించుటకుఁ గారణము మృగ్యము. కథానాయకురాలు నేను చూచిన పాముపాటలో త్రిలోకసుందరి యను పేరితో నున్నది. మల్లికార్జునశాస్త్రిగారు సత్యవతి యని వ్రాయుటకుఁ గారణము వేఱొకచో వారి కట్లుపలబ్ధమై యుండనోపు. బ్రహ్మాండపురాణాంతర్గతమైన దీగాథ యని ఆయన వ్రాసినారు. అందు సత్యవతి యని యుండిన నుండును. పేర్లలో నించుక భేద మున్నను ప్రధానగాథ యొకటే. ఇట్టి స్థితిలో నేను దీనిని

రచించుట తప్పుకాదా? అయినా నాపొరఁబాటును దెల్పినవాఁడు దీనిని గృతినందిన శేఖరరావున కన్న శేషగిరిరావు. అతనివద్దనున్న యొక సంపుటములో మల్లికార్జునశాస్త్రిగారి సత్యవత్యుపాఖ్యానము కనుపడినది. చదివిచూచితిని. ఏస్వల్పమో భేదించినను అదే యిది, యిదే అదిగాఁ గనుపట్టినది. రచించినదానిని వృథపుచ్చనేల యని యెంచి దీనిం బ్రచురింప సాహసించితిని. శేషగిరిరావుకూడ నాయూహకుఁ బ్రతిఘటించినవాఁడు కాఁడు. అతని విమర్శనశైలి చాల నపూర్వముగా నుండును. అట్టివాఁడు ప్రకృత విషయమున నేమియు ననక మిన్నకుండుటయే దీనిని నేను బ్రకటించుటకుఁ గారణము. అది యటు లుండె. మనుష్యులకు సర్పములు పుట్టుట అక్కడక్కడఁ గలదని పెద్దలవలన వినుకలి గలదు.

నా గా భ ట్ల వా రు

అనువారు మొదట నృసింహదేవరవారనియు వారికి సర్పముదయించిన పిమ్మటనే యింటిపే రట్లు మాఱినదనియుఁ జెప్పఁగా వింటిని. వీరు మాబందుగులే. దీనిని ముద్రించునపుడు

గ్రం థా ల య ప్రె స్సు లో ని

ప్రూఫురీడర్లు కొన్ని విశ్రమప్రమాదములను సూచించి దిద్దించి విమర్శకులకుఁ గొంత పరిశ్రమ తగ్గించినందులకు మిక్కిలి సంతసించుచున్నాఁడను. ఇట్టి తెల్వితేటలు గల ప్రూఫురీడర్లు భైరవప్రెస్సున మున్నుంఢుటెఱుఁగుదును. ఇక్లైంద తెన్నివిధముల శోధించినను కొన్ని మాత్రము డాఁగి యిటీవలఁ బొడకట్టినవి. వాని సవరణ చూపెదను.

32 వ పుటలోఁ దుట్టతుదిపంక్తిలో మాట అనునది 'రాణ' అనియు, 42 వ పుటలో తుట్టతుదిపంక్తిలో' కునేఁ' అనునది 'కొగిం' అనియు 69 లో 'ణ్ణా—ణ్నా' అనియు, సవరించుకోఁ గోరెదను. ఏ అర్ధానుస్వారములోతప్ప నింతకన్న సవరింపం దగ్గవి లేవు. ఒకచో ఉ. అనుటకు చ. అని పడినది. ఇది గ్రంథకర్తకు చంపకమాలోత్పలమాలాభేదము తెలియ దనుట కుపకరించెడిది గాన సవరణ తెల్పక తప్పదు. దేవీభాగవతము షష్టిపూర్తి కమిటీవారు ముద్రించు సమయమునకు నా స్థితి బొత్తి

"కిందెట్టు మీఁదెట్టు"

వైఖరిలో నుంటచే నాసాయము వారికి లేశముగూడ లేకపోయినది. ప్రథమ ముద్రణములో నొకచోట——

"లోకైకాగ్రణ్యుఁడు" అని

అగ్రగణ్యశబ్దమునకు - అగ్రణ్యుఁడు అని తృతీయస్కంధములో ౪౭౬ వ పద్యములోఁ బడినది. ఇక్కడనే కాదు. వేఱొక్కచోటఁగూడ (ఇపుడు జ్ఞాపకము లేదు) నీప్రయోగ మున్నట్లే జ్ఞాపకము.

లోకైకస్తవ్యుఁడు

అని సవరించినచో నిది సరిపడును. నిన్న మొన్న శ్రీ ములుగుపాపయారాధ్యులవారి భాగవతసంస్కరణము నామీఁదికి వచ్చినది. ఆ సందర్భములో మాదికూడఁ జదువుట తటస్థమైనది. ప్రథమస్కంధములో——

"మమ్ము, నోంపు మట్లేని నీకు వధ్యులము మేము"

అని కనుపడినది (౧౯౪ వ పద్యము చూ.) తుంపుము అనుటకు బదులుగా నిట్లు పడుట మాప్రమాదమే అని తోఁచినది. ఇంకను మఱి కొన్ని నీహారలేశము లిట్టి వుండకపోవుగాని అయ్యవి యేప్రూఫురీడర్లకో గోచరించునేమో కాని గ్రంథకర్త యెంత శ్రద్ధగాఁ జదివినను గోచరించుట దృశ్యాదృశ్యమే. ఏమి యదృష్టమోకాని బలవత్తరమైన ప్రమాదము లుండియు నయ్యవి ప్రతిపక్షులకు గోచరింపక నాకే గోచరించుచుండును. ఇతరు లెట్లుగా భావింతురో కాని నేను మదుపాస్యదేవతాకటాక్ష మనుకొందును. ఇపుడు నేను స్వయముగాఁ జూచి అచ్చొత్తించుచున్నప్పటికి బోలెఁడు ప్రమాదములు గోచరించుచో నితరులు చూచి ముద్రించుగ్రంథములమాట వేఱుగఁ జెప్పవలసి యుండదుకదా ! అందులో యతులు బొత్తిగా గోచరింపవు. ప్రాసము లెక్కడోగాని పొరఁబడవు. యతిప్రాసలు తప్పు టొకతప్పు గానట్లే యతిప్రాసలు కూర్చునంతలోనే యుండు కవన మొకకవనమును గాదని సహృదయు లెఱుఁగుదురు. గోచరించినంతవఱకుఁ బ్రస్తుత గ్రంథము

నందేకాక ప్రసక్తానుప్రసక్తముగా నితరత్ర గోచరించిన ప్రమాదములుకూడ నిటఁ జూపితిని. తక్కినవి ప్రాజ్ఞు లిట్లే సవరించుకోవలయునని విన్నవించుచున్నాఁడను. అసలు ప్రధానమైనది కవిత్వమునకు రసము. అది పూర్వజన్మసంస్కారమువినా ఘటింపదు. అది యేకొంచెమేని యున్నచో నిట్టి స్వల్పములే కాదు—మఱియెట్టివేని కమ్మకొని పోవును, అది లేనిచో—

"స్వాహా స్తపాకమువలె"

నెంతపరిశుద్ధమైన రచనయు లోకమునకు రుచింపదు. అట్టి రసమును లేక శబ్దశుద్ధియును లేనిచో నిఁక నేమి చెప్పవలయును? ఆయా విషయములితరత్ర విస్తరించియుంటచే నిందు స్పృశించి విడిచితిని. మఱియు కవికి నన్నిటికన్నఁ బ్రయోగవిజ్ఞాన మావశ్యకము. ఒకటి యుదాహరించి వ్యాకరింతును.

లవలేశములు

ఇది శిష్టులు వాడుచుండు ప్రయోగము. నిర్దుష్టము. కాని పునరుక్తిదోష మిట నున్నదని భ్రమించి వెదకితిని.

కుర్వన్తి కామసుఖలేశలవాయ దీనాః.

అని శ్రీమద్భాగవత తృతీయస్కంధమునఁ గలదు.

అణోర ప్యణ్వంశాయ

అని దానివ్యాఖ్య. ఇట్లు పరిశీలించు నోపిక కవి కావశ్యకము.

"పూర్వకవి ప్రయోగదక్షత్వ"

మన్న నిదియే. ఇంతవఱ కేదోవ్యాసమున నుదాహృతమే.

శ్లో॥ యద్భక్తి లేశలేశాంశ లేశలేశలవాంశకమ్"

పై ప్రయోగము దేవీభాగవత చతుర్థస్కంధములోనిది. ఇట్లు సర్వథా పరిశీలించుట కవికావశ్యకము. ఇది లేనిచోఁ గలిగెడి హానికి మితిలేదు.

సహృదయాః ప్రమాణమ్

ఇట్లు,

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

శతావధాని.

శ్రీమత్పరదేవతాయై నమః.

శుభమస్తు, అవిఘ్నమస్తు

# పతివ్రత

(తిరుపతి వేంకటీయము)



## ప్రథమాశ్వాసము

చ. సిరికి నివాసమై విబుధసేవితమై తగువెండికొండ గ
హ్వరమునఁ బుత్రులున్ మఱియు భార్యలుఁ దన్ను భజింప గేస్తువై
ఖరి నలరారు దేవర జగత్త్రితయావనకర్త సోమశే
ఖరునకు సోమశేఖరుఁడు గల్గఁగఁజేయుఁ జిరాయురున్నతుల్. ౧

వ. ఇట్లు కృతిపతి కభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లు దీవించి కథ
నుపక్రమించుటకు ముందుఁ గొండొక ప్రస్తావించెద. ౨

చ. కలియుగమందుఁగూడ నిహకాంక్షయొకాక పరంబునందుఁ గో
ర్కులు గల పండితోత్తములు కొందఱు ధర్మవినిర్ణయార్థ మ
ర్మిలిఁ బరిష త్తొకానొకఁడు మేటులఁ జేరిచి నిల్పి యందుఁ బె
ద్దలవలనన్ విశేషములు తత్పరులై వినుచుండి రింపుగన్. ౩

ఉ. ఆసభ కేగుదెంచె సకలాగమమర్మవిదుం డొకం డుప
న్యాస మొనర్ప; నయ్యనఘు నర్చితుఁ జేసి సదస్యు లయ్యుప
న్యాసకుతోడ నిట్లనిరి, ఆర్య! యొకానొక సందియమ్ము ని
ష్కాసితముం బొనర్పవలె సర్వసమర్థులు మీరు గావునన్. ౪

వ. దాని స్వరూపం బెట్టి దందు రేని. ౫

తే. గీ. పురుషజన్మంబు సర్వథా పూజ్య మనియు
నాఁడుజన్మంబు దానికి నంద దనియు
గ్రంథములు చెప్పుకతననో? కాక యేమొ ?
స్త్రీలు మగపుట్టువున కాస సేయుచుందురు. ౬

మ. పరిశీలించితిమేని సంసరణపుర్ భారంబు సర్వంబు స్త్రీ
పురుషుల్ తుల్యముగా వహించినను సంపూర్ణాధికారంబు తాఁ
బురుషుర్ జెందుటకుం గతం బతఁడె యే ప్రొద్దుర్ శ్రమంబూని త
త్పరుఁడై ద్రవ్యము సేకరించుటని విస్పష్టంబుగాఁ గన్పడుర్. ౭

ఉ. తెచ్చిన వస్తుజాలమును దీర్పరియై గృహిణీలలామ తాఁ
బొచ్చెము లేక వ్యర్థమయి పోవఁగ నీయక యుక్తరీతిగా
నిచ్చలు వండి భర్తకు వినీతిగఁ బెట్టుచుఁ జుట్టపక్కముల్
మెచ్చఁగ సంసరించుపని మించి మఱొక్కటి యుండ దామెకుర్.

తే. గీ. వంశుసేరుపు వినయంపు వర్తనంబు
కడు సదాచారసంపత్తి గలిగి యున్నఁ
జాలు నిల్లాలి కిఁక గృహస్థపవరున
కెంతొ తాపత్రియం బుండు నెంచిచూడ. ౯

క. ఐదవ యేఁ డేతెంచిన, దాదిగ బడి కేగి యక్షరాభ్యాసం బా
సాదింపవలయుఁ బదియేం,డ్లెదొ చదువంగవలయు నిది కష్టమకా!

చ. గురుకులవాసముర్ సలిపి కూరిమి మాధుకరంబు వారముల్
జరుపుచు నమ్మ గాని యొకసాధ్విని 'నమ్మ' యటంచు బొబటం
బొరులను గొల్చి నేర్వవలె నూరక విద్దియ రాదు దీనికిన్
దరుణులు గారు లక్ష్యములు స్నాతకపున్ వ్రతచర్య వీరిదే. ౧౦

తే. గీ. ఎక్కడే నొక్కనారి యే యించుకంతొ
విద్య నేర్చిన దున్నను విధిగ నేర్చి
తీరవలెనని లే దట్టి తీరువున్న
స్నాతకవ్రతముండెడి స్మార్తమందు. ౧౨

ఉ. నేరువనచ్చు విద్దియను నేరువ కున్నను దప్పు లేదువో ?
నారికిఁ బూరుషుం డటుఁ గనందగ దెట్టులొ విద్య నేర్చియే
తీరవలెన్ వెలందికి విధించిన నియ్యది నెగ్గు టెట్లు? సం
సారమునందుఁ జేరవలె శైశవ మేగిన కొన్నినాళ్ళకున్. ౧౩

వ. సంసారమునందుఁ జేరక విద్యార్థినియై వయఃకాలమ్మున గురు శుశ్రూష యొనర్చుటకు మనపెద్ద లంగీకరించిన ట్లగుపట్టదు. అటు లంగీకరింపకుండుట స్త్రీల నధోగతికిం బంపు దురుద్దేశమ్మునగా నిప్పటివారు పలువు రపవదింతురు గాని యది యట్టిది కాదనియు స్త్రీలకుఁ బ్రధానంబగు మానధనంబు సంరక్షించుటకే యనియు నిష్కల్మషహృదయులు భావింతు రని మఱియును. ౧౪

మ. ఋతుకాలం బరుదెంచు పిమ్మటఁ గటా! స్త్రీ విద్యకై పెద్దపం
డితు లెందుండిన నాడకేగి యచట న్నెమమ్ముగా నుండి పం
డితశుశ్రూష యొనర్చి మాధుకరమేనిన్ వారముల్ గాని స
మ్మతిమై నెత్తినగాథ లెందు విన మేమాన్యుండు వాకువ్రాఁడున్.

మ. చిరశుశ్రూష యొనర్చి నేర్చెడికళల్ స్త్రీ నేర్చు సామగ్రి యెం
దరయన్ గన్పడ దింటఁ దండ్రి గురువై యన్నల్ మఱిం దమ్ములున్
గురులై చెప్పిన నేర్వవచ్చు నదియున్ గొండంత గాఁబోద య
క్షరవిజ్ఞానముతో సమాప్త మగు "భాషామంజరీ" సామ్యమై.

వ. ఇయ్యది ప్రసక్తానుప్రసక్తంబుగాఁ దగిలినది ప్రాచీనసంసారిణులన్ బలె జీవయాత్ర గడపుస్త్రీకి విద్యాభ్యాసంబునకు నవకాశంబు

లేకుంట స్త్రీప్రకృతి గలిగించిన దోసంగుగాని ప్రాచీనపండితుల దోసంగు కాదనునది ప్రకృతంబు. ౧౭

ఉ. కావున విద్యకై యొరులకాళులు వట్టెడి కస్తి యేనియుం
స్త్రీవిషయంబుగాద, యొక స్త్రీ పురుషుం డొకపూరుషుండు స్త్రీ
గా వసుధం జరించినను గాదది యెల్లర కొజ్జబంతి? యే
కోవిదు లద్ది న్యాయ్య మనుకొందురు? వెంగలు లెవ్వరో వినా. ౧౮

వ. మఱియుం బూరుషులు విద్వాంసు లగుటంజేసి తాము తరించి జన్మాంతరమం దుత్తమలోకావాప్తి నందు నుపాయమ్ము లెఱింగి యుందురనియు విద్యాగంధమ్ము లేకునికింజేసి స్త్రీలకుం దరణోపాయంబు లేదనియు విచారంబు గలిగెడిం గాని దీనికి మఱుపెద్దలు.

క. పాతివ్రత్యవ్రత మొండే తారక మతివలకని యొర్పఱచిరి గా
నీ తపముకన్న నియ్యది, భీతిన్ గలిగించు నేఁడి నేకిని కేసిన్. ౨౦

తే. గీ. ఎంతటి దురాప మగు కార్యమేని తపము
వలన సాధింపఁబడు టది శాస్త్రసమ్మ
కాని తప మది సాధింపఁగాఁ దరంబు
గాదని వచింతురు పెద్దలు జ్ఞానధనులు. ౨౧

క. తపమునకుఁ బెక్కుమార్గము, లుపాయవిధు లాఱతిచ్చి యువిదలకై యే
తప ముపదేశించిరొ? ఆ, తపమున కొక్కటియె ప్రోవ ప్రదీపర మేదీ?

సీ. వేదశాస్త్రంబులు విధివిహితంబుగా
నధ్యయనము సేయు టదియుఁ దపమె
తన కున్నకొలఁదిని దానంబు దీనుల
కర్థిమై నిచ్చుచో నదియుఁ దపమె
అస్పృశ్యంబు తననాల్క కంటకుండఁగ సత్య
మధిగమించి చరించు టదియుఁ దపమె

బహిరంతరములఁ గోపంబు లేశంబేని
యలమకుండఁగ మను టదియుఁ దపమె

గీ. మఱియునుం గొన్ని యున్నవి మార్గములు ద
పమ్మునకుఁ బతివ్రత తాల్చు వ్రతమునకు నొ
కండె మార్గము పతిసేవకన్న నితర
మరయఁబడ దెట్లు తరియింతు రబల లిందు. ౨౩

పురుషుఁడు యోగ్యుఁడు దొరకిన
తరుణికి నిది సాధ్యమయ్యెఁ దక్కిన స్త్రీకిం
గరము నిది దుష్కరమ్మగుఁ
బురుషుల నవివేకు లుంద్రు భువిలో నెందున్. ౨౪

. పురుషులు సేయునట్టి తపముల్ పువుఁబోఁడులుకూడఁ జేసి న
ల్లెఱుఁగఁబడున్ జగజ్జనని యీశ్వరి యీశ్వరుఁగూర్చి చేసె న
గ్గరితకు వేదశాస్త్రములగాథలతోఁ బని యుండ దట్టు లే
తరుణియు జేయ నేరదు వృథా యగుఁ జేయుటకుం గడంగినన్. ౨౫

. దేవతలతోడఁ బోలిక, కేవనితయు నేపురుషుఁడు నెప్పట్టున సం
భావింపఁదగమి తెల్పిరి, కోవిదులట్లగుట స్త్రీ కొకొండె తపం బౌ.

. అది పాతివ్రత్యంబే, సదమలుఁడున్ ధనియు నందచందమ్ములకున్
గుదురు నగు వానిభార్యకు,నది సాఁగునుగాక సాఁగునా? ప్రతిసతికిన్.

వ. తెలివి హుళిక్కి, తేఁకువయు ధీరతయు న్నహి, మూర్ఖకోప మ
గ్గల మిఁక నెన్నిగావలయుఁ గాపురుషాంకము లన్నిగూడఁ బు
ష్కల మటువంటిదేబె తనసాధ్వి నొకానొకగడ్డిపోఁచగాఁ
దలఁచి యవాచ్యముల్ పలుకు ధార్ష్ట్యము సహ్యమెటుల్ సుధీమణీ.

ఉ. నాగరికాగ్రిగణ్యు లిది న్యాయము గాదని స్త్రీలదుస్థితిన్
బాగొనరింతు మంచును సభల్ ఘొనరించుచు స్త్రీల కందులో

భాగ మొసంగి భర్తపయి భార్యకుఁ గష్టము దోఁచె నేని సు
శ్రీ గల యన్యుఁ గట్టుకొను చెయ్ది వర మ్మనిపింతురి వారిచే. ౨౯

క॥ ఆవల నెవ్వనితోనో, కావలమునఁ బొత్తు గలిపి కాని వృథాగా
నేవనిత మొదటిభర్తన్, దా వీడెడి వీఁడుచోఁ బిదప నేమగునో?.

క. సీత పతివ్రిత ద్రౌపది, పాతివ్రిత్యమున కిక్క బహుపతులున్నన్
శ్రీతులఁదూఁగెడి వీరల, పాతివ్రిత్యమునఁగలదె? భారములవమున్.

శా. ఏలోపమ్మును లేని శూరుఁడు గుణాహీనుండు మానీంద్రులున్
వాలాయమ్ము భ్రమింపఁగాఁ దగిన సౌందర్యమ్మునం బొల్చుస
చ్ఛీలుం డబ్బిన సీతపోల్కి నిఁక నేసీమంతినుల్ నిల్తు ? రే
వేళన్ దిట్టుచుఁ గొట్టుచుండు మగలన్ విశ్వేశులం చెంచుచున్.3౨

క. కావున స్త్రీ తరియింపం,గా విజ్ఞులు చెప్పుత్రోవ కడు గహనంబై
యేవనితలకో తక్కిన, సేవింపన్ వీలుగాని చిక్కుగ నుండెన్. 33

క. ఒకశే తరణోపాయం, బకలంకం బుండె నదియు నవలంబింపన్
గొకిబికిగాఁ గనుపట్టెడి, సకటా! స్త్రీజాతి కింక నాదరు వేదీ. 3౪

తే. గీ. అందులోఁ బూర్వమున్ బలె నణఁగి మణఁగి
యుండుకాలమ్ము గాదిది యువిదలందు
నక్షరజ్ఞాన మున్నది హద్దు మీఱుఁ
డనుచు నయ్యది ప్రేరేచు నాఁగుటెట్లు. 3౫

తే. గీ. "ఇతరఖండ నాగరికత యెప్పటికపు
డెఱుకపఱచెడి పత్రిక లెన్నొ యున్న
వాయబలలెల్ల నరకాన కరిగి మనము
మాత్రి ముందుమె? స్వర్గాన మహిళలార." 3౬

తే. గీ. అనుచు ప్రేరేచు స్త్రీ లుండి రచ్చటచట
నట్టివారికిఁ దోడుగా నబలల దుర

వస్థఁ బాపెడి వంచును బత్రిక లోక
కొన్ని యున్నవి యిటువంటిగోలనుండి
గోల లెటు తప్పికొని నిల్పికొండ్రు గొనము. ౩౮

చ. పురుషులశీలమున్ జెఱుప బోలెఁడు పత్రికలుండెఁ బత్రికా
భర మటులుండఁగాఁ జెఱుచు వస్తువు లుండె నటుండికూడ ని
త్తరుణులఁగూర్చినట్టి వగ దారుణమై కనుపట్టెడిన్ జెడెం
దరుణియటన్న నాపె కిఁకఁ దా వగుపట్టద యేయుగమ్మునన్. ౩౯

క. పురుషుండు చెడియు మరలన్, గఱువలమార్గమ్ము పట్టికడ తేఱినటుల్
తఱ చగుపడుఁ గబ్బంబులఁ, దరుణింగుఱియించియట్టిదారులుకలవే.

ఆ. వె. "నూఱునోము" లనెడి ధీరులవచనంబు
"త్రోసిరా" జటన్న మాసిపోదు
పురుషకృతములైన పొత్తముల్ స్త్రీలకు
నుపకరింప పనుటయును బొసఁగదు. ౪౦

తే. గీ. స్త్రీలయం దమ్మ లప్పలు నోలిఁ గూఁతు
లెందఱో యుండ్రు భార్యలే యెందు నున్న
వారల నణంచి పెట్టంగఁ బూరుషు లటు
శృంఖలలు పన్నినారని చెప్పనొప్పు. ౪౧

తే. గీ. విస్తరించి వచించిన విధముగాఁ గ
నంబడినఁగాని మా నోడువంబడినది
సూత్రమాత్రమె యబల లేచొప్పునఁ దరి
యింపనేర్తురు? వివరింపుఁ డీరు నేఁడు. ౪౨

క. వెనుకటి మార్గము నచ్చదు, జనులకు; నిప్పటిదికూడ స్పైఁపదు తప్పం
చునెఱింగిగతానుగతిక,మనియేయిందడుగువెట్టుటని యనవలయున్.

క. ఇదియెట్టికాలమో?మా,ర్పుదయించునుగాక నిలువదొక్కటియును నేఁ
డుదయించు రేపె యస్తం,బది గను నెటు లట్టిదాని కవలంబనముల్.

వ. ఇందులకు నందఱికిని ననుభూతంబయి నట్టిదే యొక చిన్నయుదా
హరణంబు. ౪౫

శా. మోచేతుల్ దిగునట్లుగా అయిక లేమో మాఱె మున్ముందు; సా
మీచీన్యం బది చేయి సర్వమును మేల్మిఁ డాఁగె నద్దాన నం
చే చూడన్ బుజమెక్క జందెముబలెన్; జే టిద్ది సైరించు పె
ట్లాచారమ్ము లిఁకే యెటో కనులు లే కల్లాడెడిన్ హేయమై. ౪౬

ఉ. మీసములుంట పౌరుషము మీసము రోషపుగుర్తు క్షత్రియో
చ్ఛ్వాసము మీసమే వెలమవంగడపుం బస యావదాయువున్
మీసమునంద తా నిమిడె మీసముగూరిచి యెంతగా నుప
న్యాసము చేసినం దఱుగ దయ్యది యిప్పుడు మృగ్య మయ్యెఁగా. ౪౭

క. ఈ లాంఛనముల మాఱుపు
స్త్రీలకుఁ బురుషులకుఁ గూడఁ జేయదు చెఱుపుల్
శీలపుమార్పులు మాత్రం
బాలోకం బిహముఁ జెఱచి యవలకు నెట్టున్. ౪౮

క. వాతావరణము సర్వ మ,పూతంబై చెడియెఁ బాలుపో దేరికి; నీ
పాతిత్యం బెటు తప్పునో?, పాతివ్రత్యమ్ము నిలుచు పద్ధతి యెదియో?

క. వ్రతములుశతమున్నఁ బతి,వ్రతమునకుఁ సాటి రావు బ్రహ్మాదిక దే
వతలీవ్రతమ్మునో యనుచు,సతికిఁ మ్రొక్కుదురు వినుతిసల్పుదు రెలమిన్.

క. వెనుకటి యాచారమ్ములు, మనముంచి చరించునట్టి మానినులమనం
బునఁ గాపురముండుదురు స,ర్వనిలింపులు సంశయింపఁబనిలేదిందున్.

తే. గీ. ఇట్లు కబ్బమ్ములను సుకవీశ్వరులు లి
ఖించి యుంచిరి "తాటాకు" లంచు వాని

నీసడించుచుచు నున్న వా రిపుడు వనిత
లందుఁ బెక్కురు మీారిది యరసి యుందు౹. ౫౨

క. వెనుకటిసాధ్వులమార్గం,బునఁగాకమఱొండుమార్గమునఁజనియిహామం
దునుబరమందునుగౌరవ,మునుగాంచినవనితచరితమును వినవలయున్.

క. ఎన్నాళ్ళనుండియో మా,కున్నది యీకోర్కి తీరకున్నది నీవో
యన్న! మహామహితుఁడ వే, యన్నులమిన్నకతనేని యానతి నీవే?

వ. నావుడు నాధర్మోపన్యాసకుండు వారలం గాంచి ఆర్యులారా! మీా
పృచ్ఛసేయు తెఱంగు కడుంగడు విచిత్రంబుగఁ గన్పట్టెడి, స్త్రీకిఁ
దరణోపాయంబు పాతివ్రత్యంబు దక్క వేఱొండులేదని నొక్కి
వక్కాణించుచుంగూడ నింకొక్క తరణోపాయంబు వక్కాణింప
వలయు నని ప్రశ్నించుట నాకు వాగ్బంధంబు కల్పించుట తప్ప
వేఱొండుగాదని విస్పష్టంబ. ౫౫

ఉ. ఆఁకలి దీర్ప భోజనమె యజ్ఞతఁ బాపఁగ విద్యయే జను
శ్శోకముఁ బాప నెందు మధుసూదనుసంస్మరణంబె స్త్రీకి సు
శ్లోకతఁ గూర్పఁగాఁ దగినచొప్పు పతివ్రతమే తదన్యథా
లోకము మెచ్చు గాంచిన విలోలవిలోచన లుండ రెయ్యెడన్. ౫౬

ఆ. వె. అందగత్తె యైన నధికవిద్వాంసురా
లైనఁ బ్రోఢయైన నఖిలసుప్ర
తములు సల్పునట్టి ధర్మజ్ఞురాలైన
శీల మెడలి గవ్వ సేయ దతివ. ౫౭

క. నా కింతకన్నఁ దెలియ ద
నేకగ్రంథములు గంటి నెందఱనో సు
శ్లోకుల సేవించితి నిఁక
మీాకతన నెఱుంగవలయు మీారు మహాత్ముల్. ౫౮

క. ఇప్పటి నారీతిలకము, లొప్పిన్గొనరు పూర్వరీతు లొప్పిన్గొనరుగా
కిప్పటికిఁ దగినరీతిగఁ, జెప్పినచో ధర్మవిదులు నీ! యని నగరే? ౫౯

ఆ. వె. అనుసరింప నేర రని ధర్మములు దిద్దఁ
బాటు సేయనేల ? పడఁతులందుఁ
దీర్ఘభూత లగు పతివ్రత లున్నారు
చాలరొక్కో ? వారు శాస్త్రమునకు. ౬౦

క. ఒకకాలమందు మాత్రము
సకలస్త్రీజనము వ్రతము సల్పినయట్లుల్
ప్రకటించునె ? కబ్బము ; లే
యొకరో పతివ్రతలు గాఁగ నుండుటె తెలియున్. ౬౧

వ. అను నయ్యుపన్యాసకున కా సదస్యు లయ్యా ? పూర్వ పతివ్రతలం బోలిన పతివ్రత లిప్పుడుఁగూడఁ గ్వాచిత్కముగ నున్నట్లు మీరు నుడువుట సాహసంబనియ యేమనుకొందుము, కబ్బంబులఁ గనుపడు పతివ్రతలెల్ల నీ కలియుగమ్మునందలి వారుగారు. ఆ పేర్లు కల్పితములో ? యథార్థములో? అని సంశయపడువారుకూడఁ బెక్కండ్రు గలరు. అది యటు లుండె, మాకు నేఁ జేతాదృశపతివ్రత యున్నట్లు మీరు తెలుప నక్కఱ లేదు. ఈ కలియుగం బారంభమైన పిమ్మట నట్టి పతివ్రత యెక్కడనేని యున్నట్టులు మీరు విన్నచో నాపెచరిత్రింబుం గూర్చి నేఁ డుపన్యసింపం గోరెదము నావుడు నయ్యుపన్యాసకుండు. ౬౨

మ. ఒకపాత్రమ్మన నేను జూచితిని నందున్నట్టి పుణ్యాత్మురా
లికతంగూర్చి యుపన్యసించెదను వాల్మీక్యాదులంబోలె న
ల్లకవిన్ జెప్పను గొప్పవాఁ డని; యథాలాభంపుధారన్ సము
త్సుకుఁడై రా జొకరుండు కట్టెఁ గత సుశ్లోకంబు విజ్ఞోత్తముల్.

ఆ. వె. అన్ని కతలుగూడ నర్థవాదములె యం
డ్రిపుడు సీతగాని యన్యసత్ప
తివ్రతలును గాని ధీరకల్పితలుగా
వలసి వచ్చు ననుట వాస్తవంబ. ౬౪

వ. కావున నట్టిచర్చకున్ దిగక చరిత్రంబు నందలి యోగ్యతనే ప్రధానంబుగా నెంచి యుపన్యసింతుం గాన సావధానచిత్తులరై యాలింపుఁడు. ౬౫

## కథాప్రారంభము

ఉ. కుంకుమపువ్వుచేలతళుకుల్ బెళుకుల్ వలపుల్ జలాశయా
లంకృతముల్ వనస్థలులు లంకలు వొల్చెడి యాపగల్ జలం
బింకని మంచికూపములు నెల్లెడఁ బొల్చెడి యూళ్లతో ధరా
లంకరణమ్ము దేశ మకలంక మొకం డలరారుఁ బేరుగన్. ౬౬

క. అది కాశ్మీరాభిధ మని, మొదటి విశేషణమె తెల్పు భువిఁ దాదృశసం
పద గల దేశ మ్మొక్కటి, వెదకినఁ గనుపట్ట దేల? విస్తర మింకన్.

క. కవులకుఁ గవులకు వాదము, దవిలినచోఁ దీర్చు దైవతము గలయచ్చో
నెవరు "నధాత్తు" కువాద,ప్రవణులు లేరని వచింప వలయునె యింకన్.

తే. గీ. బిల్హణుండు జనించిన విషయ మదియె
భట్టబాణుండు పుట్టిన పల్లెకూడ
నచ్చటిదియె సమస్తవిద్యలకు నిలయ
మదియె యని చెప్పినం జాలు నధిక మేల? ౬౯

క. వేదవ్యాఖ్యాతలు భా,ష్యాదివ్యాఖ్యాత లగు మహామహు లందే
ప్రాదుర్భవించుకతమున నేదేశము గాని దాని కీడను బెట్టుల్. ౭౦

క. "కనకం"బను పేరిటిపత్త్,నమందొక్కండుగలదు "ధర్మాంగఁదుఁ"డన్
జనపతి పాలించున్ దా,ని నిరీతిగ నీతిశాస్త్రనియతికిఁ దోడవై. ౭౧

క. "అర్మిలి" యనుపేరిటి సహ,ధర్మిణితో నతఁడు ధర్మతత్పరుఁడై స
త్కర్మముల నాచరించుచు, నర్మిలిరాజ్యంబు నేలె నర్మిలి నేలన్.

క. సంతానం బెచ్చటనో య,నంతాపతుల కుదయించు నంతియ బీదల్
సంతునకు నోఁచినట్టుల, నంతాపతు లెందు నోఁచ రది యెక్కతమో.

క. పున్నె మొనర్చిన జీవియె, మన్నీండ్లకుఁ బుట్టవలయు మహినట్టి రెటన్
గన్న న్నాటికి నొక్కరె, యున్నకతన తేండ్ల కిట్టి యోగమెతఱచో.

వ. ఇట్లు కొందఱు వక్కాణింతురు. ఇయ్యాది యింకను విచారణీయంబు.

తే. గీ. ప్రకృతదంపతులకుఁ గొంతవఱ కపత్య
భాగ్యమది లేమి నెన్నియో వ్రతములు నుప
వాసములు తీర్థసేవలు వలసినన్ని
సలిపి రంత నపత్యసూచనయు నొదవె. ౭౬

క. నెల మసలెన్ బిమ్మట వే,విళు లొదవెన్ గర్భము నభివృద్ధం బయ్యెన్
గళలలముకొనియె భూపతి, యెలమింగ నెఁగనెడి నెలయునే తెంచెలలిన్.

క. చిరకాలపుఁ గాన్పయినన్
బరిశ్రమ మొకింతలేక ప్రసవించెన్ రా
ట్తరుణీమణి భోగీశ్వరుఁ
బుఱిటిలు రాట్సతియు భయముఁ బొందిరి పెలుచన్. ౭౭

ఉ. తేనిని బుత్రివార్త నలరించి బహూకృతిఁ బొందుకోర్కి లో
నూని ప్రతీక్ష సేయు నలయూడిగపుంజెలు లొక్కపెట్టుగా
నానకాంతు లోహటిలి యల్లన నివ్వెఱఁగంది నిల్చి రా
మానవతీలలామయును మాన్పడె సిగ్గున మ్రిగ్గి నిల్వనన్. ౭౮

వ. అట్లు నిశ్చేష్టురాలై యా భాలెంతనెలంత యంతర్గతంబున.

క. పాముం గనుట కదో! తొలి,బాముని నేఁ జేసికొన్న పాపంబేమో
భూమీశుని సతినై యే, నేమహిళలకన్నఁగూడ నెల్లిద మైతిన్. ౨౧

తే. గీ. లేని సంతానభాగ్యంబు లేదుగాక
యింతదాఁక నేతాదృశచింత లేదు
పా మనుచుఁ బాలుడైతునో? పట్టియనుచుఁ
బట్టిపెంచుకొందునో? యెట్టి చెట్ట పుట్టె. ౨౨

తే. గీ. గర్భవాసంపుఁ బ్రీతిచేఁ గాతరత్వ
ముడిగి ప్రాణానకుఁ దెగించి కొడుకు నెత్తి
కొందుఁగా కేను దాదులు కొంకుదక్క
ముట్టికొందురె యెంతటి ముప్పు వాడమె. ౨౩

క. అని సిగ్గున మ్రగ్గుచు న
జ్జననాథునిభార్య తనదు సంతానంబై
నను "బుస్సుబుస్సు" మను పా
మును ముట్టఁగ శంక గదిరి పురపురఁ బొక్కెన్. ౨౪

ఆ. వె. మంత్రసాని భీతి మాన్పి "పామగుఁగాక
మనుజదంపతులకు జనన మందెఁ
గానఁ జేయరాదు హాని" యటంచుఁ దా
సాహసించి పట్టి జనని కిచ్చె. ౨౫

తే. గీ. గర్భవాసంపుఁ బ్రేముడిఁ గౌఁగిలించి
పట్టె నెట్టెట్టులో యంతె పాలు చేపు
చున్నఁ బాల్గుడిపింపఁగ నోపదయ్యెఁ
"బాముతోఁ బని యెప్పటి కేమొ!" యనుచు. ౨౬

క. రాచకుటుంబినులం దీ, యాచార మనాది యగునొ? అటుగాదో? కా
నీ చాలవటకుఁ బ్రసూత, మేచ్ఛానయుస్తన్యమొసఁగ దేశిశువునకున్.

ఆ. వె. అట్లు గాన సర్పమై పుట్టె నక్కఱ
లేదు మానిసికిని లేదు తల్లి
పాలప్రాప్తి రాచబాలుర కెందును
దాఁచుపాము మాట తడవనేల. ౧౮

చ. పయి కనకున్న నే మచటిభామలు "పామయినప్పు డేటి కీ
దయ, తల నల్లఁగొట్టుటయె దానికి నెమ్మన మొప్పకున్న ని
ర్భయుఁడగు నే*నరేంద్రునకొ "పట్టుక పొ" మ్మని యిచ్చుటొప్పు న
ట్లయిన సుఖించు నియ్యదియు నల్లబికారియు నూఁపవల్లెలన్. ౧౯

వ. ఇట్లెవరిమనంబున వారువా రనుకొనఁ దొడంగిరి. ఆ యూడిగపు వెలందులయం దొక్క వెలంది ముఖప్రీతికరంబుగా నారాచబాలెంత రాలికి మెల్లన నిట్లనియె. ౨౦

క. అమ్మా! యిచ్చటనుండిన, కొమ్మలు మీ యూడిగంపుఁగొమ్మలె మీ యు
ప్పు మ్మెక్కి మీకు నవమా, నమ్ముం దే రిద్ది యుంత్రు నాలుక కెడఁగా!

క. నృపునకు మంత్రి మిమ్మాకా
నుపువిధ మొఱఁగింప విభుఁ డనుఁగు సచివునకు
న్నిపుణమతికి నెఱిఁగించెడి
నపు డాయిరువు రెటు సేతు రది సుఖదం బౌ. ౨౨

వ. ఇట్లు నొడువుటయు. ౨౩

ఉ. బాగిది మంచి యూహ యని పల్కిరి పైదలు లెల్ల; వెంటనే
యేగి నృపాలుతోఁ బలికె నేకతముం గనిపెట్టి యొక్కర్తు; ఱేఁ
డీ గతికిన్ దపించియును నేరికిఁ జెప్పక మంత్రిఁ బిల్చి "యీ
♦భోగికి భోగి పుట్టె" నని పొక్కిన మంత్రి గ్రహించి యిట్లనున్.

---

* టిప్పణి : నరేంద్రుఁడు = పాముల నాడించువాఁడు.

♦ టిప్పణి: భోగి = భోగము గలవాఁడు-పడగ గలది పాము. అని అర్థాంతరము.

తే. గీ. భోగికడుపున భోగియే పుట్టుఁగాని
అన్యుఁ డెటు పుట్టు నిది రహస్యముగ నుంత
మిది యెఱింగినఁ బౌరుల కెల్లిదంబు
గాఁ గనంబడు దాఁచుట కర్జ మధిప ! ౯౫

తే. గీ. ఇపుడు పుత్త్రోత్సవంబున కెల్లపురము
తగ నలంకృతి సేయఁగాఁ దగినశిల్పు
లను నియోగింతు నని చెప్పి జనవరేణ్యు
నీకొలిపి యట్లు సేయించె నెనక మెసఁగ. ౯౬

వ. ఇట్లు పుత్త్రోత్సవంబున కనువగు సన్నాహంబు గావించి వెనువెంట
నంతిపురప్రాంతంబున కరుదెంచి. ౯౭

తే. గీ. మంత్రి వేవేగ మటనున్న మంత్రసాని
మొదలుగాఁ గల ముదితల ముందు తనస
మీపమునకు రప్పించి మీ రెవరుగాని
యీ విషయమును బయి కెక్క నీకుఁ డనుచు. ౯౮

తే. గీ. చెప్పి వెలిఁజేయుచో శిరశ్ఛేదమునకుఁ
బాత్ర మయ్యెదరని పెద్ద భయము దెలిపి
వారలకు నెల్లరకును నవారి ధనము
నంబరాదు లొసంగి యిట్లనియె మరల. ౯౯

క. ఈపా మొకకొన్నాళ్ళకు
భూపుఁ డగుఁ బాము గాఁగఁ బుట్టుట కేదియో
శాపం బున్న దని పటా
టోపంబుగ వాండ్రతో నొడువుచుఁ మఱియుఁ. ౧౦౦

చ. కొమరుఁడు పుట్టె తేని కని కొంకక యెల్లరతో వచింపుఁ డే
ప్రమదయుఁ గాని కొంత పొరఁబాటున నేనియు నన్యథాప్రచా

రమునకుఁ గారణం బయినఁ బ్రాణము దక్కదు నిక్కువంబు ని
క్కము మఱి నిక్కమే యనుచు గాటముగా వచియించి పెల్చనన్.

ఆ. వె. స్వస్తివాచనములు సానిమేళంబులుఁ
బేదసాదలకును బెద్దగాఁగ
నన్నవస్త్రదాన మాదిగా సకలమ్ము
జరుగఁజేసె మంత్రిసత్తముండు. ౧౦౩

వ. ఇట్లు సకలమ్ము నిర్వర్తించి భోగిరాజని నామకరణ మొనర్చె.

ఆ. వె. "ఆఁడువాండ్రి నోటియందు నూగింజయుఁ
గూడ నాన" దనెడి కోవిదుల వ
చన మబద్ధ మగుట సాక్షాత్కరించె నా
యీరహస్య మవలి కెక్కు కునికి. ౧౦౪

క. "గోడలకుఁ జెవులు గల"వని
యాడుదు "రిద్దఱికి మించినట్టి రహస్యం
బేడకు డాఁగ" దనియు ము
న్నాడుదు రదియెల్లఁ బ్రకృత మన్నృతం బయ్యెన్. ౧౦౫

ఆ. వె. ఆలపాలు వోసి యల్లారుముద్దుగా
భోగిరాజుఁ బెంచెఁ బూవుఁబోఁడి
కశ్యపునియనుంగుఁగాంత కద్రువ యిట్లు
లవతరించెనేమొ! యధిపు సతిగ. ౧౦౬

క. "వినత కనెఁ బక్షికులమును
వనితామణి కద్రువయును బాములఁగనె" నం
చనుకొంచును నర్మిలి తా
మనమున సరిపెట్టుకొని కుమారుఁ బెంచెన్. ౧౦౭

ఉ. గానము నేర్చు నవ్వోలఁది కమ్మని పాటలు కోకిలాస్వర
స్థానము ముట్టఁ బాడ నలసర్వకుమారుఁడు శీర్ష మెత్తియ
ద్దానికి సంతసించు నది తల్లికి మోదము గల్గఁ జేయు స్త్రీ
స్థానపు గర్భపుంబెరిమ దైవ మెఱుంగు నెవం డెఱింగెడిన్. ౧౦౮

శా. ఊయేలందున మల్లెపూలు మొద లెన్నో పుష్పముల్ నించి యం
దాయల్లారెడి భోగిరాజు నిడి య య్యబ్జాక్షి యా భోగిరా
ట్ఛాయిన్ గూరిచి పాడుపాటలకు శీర్షం బల్లనన్ విప్పి తా
హాయిన్ దెల్పు నతండు; జాతిసహజంబా రీతు లెం దేగెడిన్. ౧౦౯

సీ. పలుక నేరఁడు గాని పలికినపలుకుల,యర్థంబు గ్రహియించుననితలంచు
పిలువ నేరఁడు గాని పిలు పవసరమైన, నద్దాని సూచించు నని తలంచు
నాఁకలి యని చెప్పఁ డంతియేకాని త,దభినీతిఁ గనఁ జేయుననితలంచుఁ
బాడ నేరఁడు గాని పాడినపాటలో, నందమ్ము గనిపెట్టు నని తలంచు

తే. గీ. పామయిననేమి లోకులబాలకులకుఁ
దెలివి మెడఁ దీసిపోఁ డని తెలుపమిన్న
పయి కనదు గాని తనదు నాశయమునందుఁ
దలఁచి యుప్పొంగు మరలఁ జింతను మునుంగు. ౧౧౦

తే. గీ. పదునెనిమి దేఁడు లిటు పెంచెఁ బడఁతిమిన్న
యెండకన్నను వానకన్నెఱుఁగకుండఁ
భోగిరాజును యౌవనస్ఫూర్తి మెఱసి
జనని కిడె మోదమును ఖేదమును మనమున. ౧౧౧

క. ఏ సంతానమ్మును సం
తోసముమాత్రమె యొసంగదుగదా! యిదియే
యీ సంసారపుఁ దెఱఁ గని
యా సాధ్వీమణి వచించు నాత్మకు నెపుడున్. ౧౧౨

వ. మఱియు నా జేనియిల్లాలు. ౧౧౩

క. తన కెది యిచ్చునో? దైవము
జనుఁ డదియే "మేరు" వనుచు సంతృప్తిం గై
కొనవలె "గొంతెమకోర్కెల"
నెనసి ప్రయోజనము లేమి నెఱుఁగఁగ వలయున్. ౧౧౪

వ. అని మఱియును. ౧౧౫

క. కిన్నరులు చక్కఁగాఁ బాడ న్నేర్తురు మొగములో? విడంబించుగుణా
ల న్నళినభవుం డెదియో, చెన్ను ఘటించియును దానిఁ జెడఁగొట్టు నెటో.

సీ. సకలలోకాహ్లాది చంద్రున కేటికో?
యొడలెల్ల మచ్చ లేర్పడ ఘటించె
నఖిలరత్నములకు నాకరం బగు హిమా
చలము నెల్లెడ మంచు నలవరించె
నమృతాదు లుద్భవం బందిన రత్నాక
రం బుప్పునీటఁ గరంబు నించెఁ
విద్యావినోదులౌ విద్వాంసులకుఁ గొఱ
గాని దారిద్ర్యంబు గట్టిపెట్టె

తే. గీ. చందనకుజంబులకు సర్ప సంకటంబు
పద్మనాళంబులకు ముండ్ల బాధ యిట్టు
లెల్ల సత్పదార్థంబుల కేదియొ? యొక
యంక మగుపట్టెడిని నిష్కళంక మేది? ౧౧౬

క. ఈశునకు భూషణంబు ర, మేశునకున్ శయ్య మఱియు నీశుసుతున కా
దేశము సుబ్రహ్మణ్యుని, దేశము పూజించు నిట్టి దేహమునందున్.

క. వ్యాకరణ సూత్రముల నవ, లోకించి యెవం డొనర్చె లోకోత్తరమై
టీకంబు మహాభాష్యం, బా కారుణికుండు గూడ నహిరూపుండే.

క. నా కొమరుం డహిరూపుం
డీ కొమరున కీడు వచ్చె నే నాగేంద్రుం
డో కన్య నీఁగలండని,
భూకాంతుని మహిషి తలఁచుఁ బోరఁబోరి మదిలో. ౧౨౦

ఆ. వె. నాగకన్యకలకు నరనాథసుతుల క
నాద చుట్టఱికము లమరినట్లు
కబ్బములు వచించుఁ గవ్వడి యులయులూ
పిని వరించి కొమరుఁ గనియెఁగాదె? ౧౨౧

వ. ఇట్లు తటంబు లేని మనోరథప్రవాహంబునం దమ్మగువ యోల లాడుచుఁ గొండొకసేపు సంతసంబునం బొదలియు మరల నందనుం దలంచికొని యీ సరీసృపంబునకుఁ బెండిలియెట్లగునని పోరఁబోరి వగలం బొగులం దొడంగు నిట్లు కొండొక కాలం బతిక్రమించె.

చ. కొమరునిపెండ్లిమాట యని కోమలి భర్తకు విన్నవించుకో
సము మది నేగనెంచు నొగి సందియముం గనుఁ బుత్రుఁ డుండు గే
హమున కలంకృతుల్ సలుప నయ్యాయిదాదుల హెచ్చరించు నా
యమ భగవంతు దూఱు నిది యాత్మకృతాకృత మంచుఁ జింతిలున్.

వ. ఇట్లు చింతిలియు మరల వ్యామోహమ్మునం బడి. ౧౨౪

చ. కొమరున కందకత్తె యగు కోమలినే వెదకించి తెత్తు నం
చు మది విచారణల్ సలుపు సుందరి; పుత్త్రికుఁ డెట్టిఁడేని యం
దము గలకన్నెనే వెదకి తల్లులుఁ దండ్రులు పెండ్లిచేయ య
త్నము లొనరించు టెల్లెడఁ గనంబడు నియ్యది కొత్త గాదుగా.

వ. ఇట్లు కొండొకకాలం బరుగుటయు, ౧౨౬

ఉ. కొందఱు తెంపు కన్యకలకుం బరిణీతి యొనర్చు నిచ్చ నం
దందుఁ గుమారులన్ వెదక నంపిన విప్రులు వచ్చి వీరిపు

తుంం దలపెట్టినట్టి సడి యాఘిగ భూవిభుఁ డాలకించి మం
త్రిం దనయంతికమ్మున కరిందముఁ డల్లనఁ బిల్చి యిట్లనున్. ౧౨౮

క. ఇందాఁక దాఁచిపెట్టితి, మెందఱు భూపతులో కన్యనిత్తుమటంచున్
బందువు లితరులు విప్రుల, నిందుల కంపించు టీవు నెఱిఁగినదే కదా?

ఉ. దగ్గఱఁ జేఁడు లెట్లొ కలత్ర్య మెఱింగిరొ? యేమొ! యెవ్వరున్
బెగ్గడలన్ వరుం గని వరింపగ నంపరు వచ్చునట్టియా
పెగ్గడలెల్ల దూరగులె పిల్లని జూపుట యెట్లు? నాకు బల్
సిగ్గగుచున్న దెయ్యదియొ? చేయు ముపాయ మపాయశూన్యమున్

వ. నాఫునకు మంత్రికోవిదుం డిట్లను. ౧౩౦

శా. రాజా! నీ కొమరుండు తప్పక మహారాజుల్ తనుం గొల్వ నీ
రేజాక్షీ ప్రియుఁడై ధరావలయ మోర్మిన్ దాల్చువాఁ డౌటకే
యీజన్మం బిటు లెత్తుహేతు వని నే నీక్షించి గోప్యంబుగా
నోజన్ డాఁచితిఁ బెండ్లిసేయుదము సర్వోత్కృష్టవరా షక్కిఁగన్.

క. మనుజులకు మనుజులే కద!
జననం బందుదురు సర్వజనసమునకు యో
జన చేసిన నా కేదియొ
ఘనమగు కత మున్నయట్లు కనుపట్టు నృపా. ౧౩౨

క. తలిదండ్రులపాపం బని
చులుకగఁ బలికెదరుకాక శునకమొ మఱియే
యెలుకదొ? పిల్లియొ? కా కీ
యిలఁ దల భరియించు సర్ప మేలా పుట్టున్. ౧౩౩

ఉ. కావున దీని కెయ్యదియొ? కానఁగరాని నిమిత్త మున్నటుల్
భావనఁ జేసి యెల్లపుడు భావనఁ జేయుచు నుండు నొక్కటన్

గోవిదుఁ డొక్కఁ డిందుఁ గల గూఢత సూచనఁ జేసె నామనో
భావము దానితోఁ గలిసెఁ బండితుఁ డాయన జ్యోతిషమ్మునన్.

చ. అతనికి నీ కుమారు నుదయంపు దినమ్మును వేళయున్ గ్రహ
స్థితియును వ్రాసి చూపితి సుధీమణి దానిని జూచి వెంటనే
స్మిత మొనరించె 'నేమి?యది చెప్పు' మటంచును బృచ్ఛసేయఁ బం
డితుఁ డతఁ డేమి లేద యిది నీవు పరీక్షకు నిచ్చినా వనెన్. ౧౩౭

వ. అని యొక్కింత సేపు పరిశీలించి మర్మగర్భంబుగా నిట్లు వక్కాణించె.

ఆ. వె. పుట్టుభోగి యితఁడు పురుషోత్తమాంఘ్రుల
నెపుఁడు దలను దాల్చు నితరుల కగు
పడుట కిష్టపడఁడు పార్థివు నిల్లాలి
కొడు కితంఁడు పుడమి కొడయఁ డగును. ౧౩౮

వ. అని మఱియుం గొంత యోజించుట నటించి యితని జాతకమ్ము
నకుఁ గొంతయాలస్యముగాఁ గాని యోగించు దశ కనుపట్ట దయ్యది
యేని మిక్కిలి యాలస్య మ్మనుకో నక్కఱ లేదు. భగవదనుగ్ర
హంబున సర్వంబు సంపన్నంబు కాఁగలదని కొంత గూఢమ్ముగా
గూఢపాచ్చరిత్రంబు వక్కాణించుట కక్కఱపడి యిఁక నెట్లును
నీ రహస్యం బీయనకుఁ జేఁజిక్కినట్లయినది యని యెంచి యిదమిత్థ
మ్మని తెలుపక గంభీరముగా మఱల నిట్లంటి. ౧౩౯

చ. ఇతనికిఁ బెండ్లి యెప్పు డగు నెట్టి తలోదరి భార్య యా సతీ
పతు లెటు లుందు్రి వీరల కపత్యము కల్గునొ? లేదొ? భాగ్య జీ
వితమొ? దరిద్రజీవితమొ? వింద వచింపు మనంగ నాతఁ డ
ప్రతిముఁడు సర్వమున్ దెలిపె భావిచరిత్ర యథాతథమ్ముగన్. ౧౪౦

క. అది నామది యూహకు దో,హద మొనరిచె నీకుఁగోడలగు కోమలిచే
బదిలంబగు సకలము కో,విదు డాతఁడు భావివేత్త వితయనఁడెదియున్

వ. మఱియు నయ్యనఘు నెన్నియో చిక్కుఁగ నుండు విషయమ్ముల నడిగి చూచితి నవియన్నియు వీసమ్మును వీసరవోని తెఱఁగునఁ జక్క వక్కాణించె నక్కతన నియ్యదియు నిక్కంబగు నను నమ్మిక నాకుం జిక్కినయది. ౧౪౧

ఉ. భారతగాథలందు వినవచ్చెడి మున్ను శిఖండి యాఁడుదై
పూరుషుఁడైనటుల్ పిదపఁ; బుణ్యపుఁగాలము కూడివచ్చి యా
కారము మాఱి నీసుతుఁడు కాంచునొ యేమొ? మనుష్యరూప; మె
వ్వారి కెఱుంగనౌ నిది; వివాహ మొనర్తము సక్రమమ్ముగన్.

క. దానికిఁ దగినయుపాయము, నేనింతకుమున్నె నిశ్చయించితి సకల
మ్మే నిర్వహింతు ననవుడు, నా నరవరుఁ డిట్టులనియె నాసచివునితోన్.

క. వరుఁజూపు మనినచో నెవ్వరిఁజూపుదు వన్యుఁజూపి వరియించినయా
తరువాతఁ బుత్తె నాతఁడె, తరుణికిఁ గట్టుటది యెట్లు తప్పెడి ననఘా.

చ. పదపడి పుణ్యపాకమునఁ బౌము కుమారుఁడు గాఁగ మాఱినన్
మొదట నెవండు పాణిఁ గొను ముద్దియ కెవ్వఁడు తాళిగట్టు వా
నిదె యగు భర్తృభావము; మనీషులు దీని వినాఁగ నింక నె
య్యదియును సమ్మతింప రపహాస్యతకున్ గుదురౌ కతమ్మునన్.

ఆ. వె. వానిఁ గాదటంచు వనిత యన్యుని బొంది
యిహపరములకుఁ జెడు నెట్లు దీని
నీవు చక్కఁబఱతు వెఱిఁగింపు నావుడు
మంత్రి వల్కె నిట్లు మంతనమున. ౧౪౬

వ. రాజేంద్రా! సావధానంబుగ నవధరింపుము. వరు నవలోకింప వచ్చిన వృద్ధులకు నా కొమరుం జూపుదు, వివాహంబు పొసఁగెనేని వారితో మారాజకుటుంబమర్యాద యనాదిగఁ గత్తినిఁ బంపి వివాహ మాడుటయే కాని పెండ్లికుమారుఁడు వచ్చి తాళి గట్టు

నాచారమ్ము కలది గాదని ఖండితంబుగా నొడువుదు. నిందుఁ గల మర్మంబు సమీపస్థులకు గోచరించును గాని దూరస్థులకు గోచరింపదు కదా! సమీపస్థు లెవరేని వచ్చి కన్నె నిత్తు మన్నను వారితో నీ విషయము ముచ్చటింపక యెట్లో యనాదరింతు. దూరగులు నా మంత్రిమ్మున నొకరు గాకున్న వేఱొకరేని లోఁగక పోరని నా నమ్మిక. ౧౪౭

ఉ. పాయమి పోయె గాని యొకపాటి కురూపియొ గ్రుడ్డి కుంటి గా
నో! మఱి పుట్టెనేని నిజ మొప్పుగఁ జెప్పియె సుప్రసిద్ధుఁ డౌ
భూమిపుఁ గూతుఁ బెండ్లముగ భోరనఁ బెండ్లి యొనర్పవచ్చు నె
న్నో మును పుట్టి పెండ్లికత లున్నవి నీవు నెఱింగియున్నవే. ౧౪౮

తే. గీ. పుట్టుగ్రుడ్డికి ధృతరాష్ట్ర భూమిపతికి
నిచ్చె గాంధార నృపతి తా నెఱిఁగి కూతుఁ
బాండురోగికి నిరువురు భార్య లెఱుఁగఁ
వే! మహీప! కుంతియును మాద్రి యిందుముఖులు.

మ. ప్రకృతం బట్టిది గాదు కేవలము సర్పం బీ రహస్యంబు చె
ప్పక చేయన్వలెఁ బెండ్లి; భావిచరితన్ వాకుచ్చుచో నేరు జా
తకము న్నమ్మి తనూజ నిత్తు రిడినన్ దన్వంగి యెవ్వర్తు పెం
డ్లికిఁ దా సమ్మతిఁ జూపుఁ గాన నెదియేనిన్ జేతుఁ గాపట్యమున్.

చ. ధనికులపిల్ల కాయలనె తద్దయు రిక్తులు గూడఁ జూచి క
న్నెనొసఁగ నెంతు రింక నవనీపతిపుత్త్రికలన్ గుఱించి చె
ప్పను వలెనే? నృపాలు నినుఁ బట్టి భవత్తనుజాతు నల్లుఁగాఁ
గొనఁగఁ దలంచువార లెటు గోరిన నొప్పుదు రందుకే వెసన్.

మ. ధనమున్నన్ సకలంబుఁ గప్పువడెడిన్ దారిద్ర్యమో? యెన్ని మే
ల్గొనముల్ గల్గిన నన్నిటిన్ దొలఁచు, నాలోచించి నే నీదు నం

దను భోగీంద్రుఁ గళత్రయుక్తునిగ సంధానింతు నా సాధ్వి భో
గిని భోగిం బొనరించి మెప్పు గొను సత్కీర్తుల్ జెసల్ నిండఁగన్.

వ. ఇవ్విధమ్మున నాసచివుండు జేనిని మెడవిఱిచి సమ్మతింపఁ జేసి సమీపస్థులైన రేతెంచిన వారల కేదో యడ్డంకి చెప్పి పంపుచు దూరస్థులకై నిరీక్షించుచుండె. ౧౫౩

ఉ. పెండిలికై వరుఁ వెదకు వృద్ధులలో నొక వృద్ధుఁ బిల్చి యే మండల మేలు మీనృపుఁడు మా కెఱిఁగింపుఁ డటన్న వృద్ధ వి ప్రుండు సమస్తముఁ దెలిపి పుస్తకపుఁ మడిపెట్టె నున్నయ ప్పెండిలికూఁతు చిత్తరువుఁ బ్రెగ్గడ కిచ్చెను జాతకమ్ముతో. ౧౫౪

ఉ. మంత్రిరి చిత్రమందుఁ గల మానినిరూపముఁజూచి జేనిసి ద్ధాంతులు వ్రాయు జాతకమునందలి యంశముల గ్రహించి యీ యింతి ధ్రువమ్ముగా మసన్నృపేంద్రుని కోడలుగా జనించె ని క్కాంతతపమ్ము పామునకుఁ గల్గఁగఁ జేయు మనుష్యరూపముఁ.

మ. అతిగూఢమ్మగు నీరహస్యమును నిం దావంత సూచించి ర ప్రతిముల్ జాతకసారవేదు లగుదైవజ్ఞుల్ ధ్రువం బీపతి వ్రతచే జేనికి రాణికిం గల యపారంబైన సంతాప ము ద్ధృత మా దైవకృతంబు తుట్టతుద కీ రీతి న్నివర్తించెడిఁ. ౧౫౬

ఉ. ఇంతటి సత్పతివ్రత మఱెందును మున్ జనియింప లేద యే ప్రాంతమునందుఁగాని యిటుపై జనియింపఁగఁబోదు పెద్దసి ద్ధాంతులు దీని నెక్కుడుగ నారసి నొక్కి లిఖించి రీపె వృ త్తాంతము సర్వదిక్కుల నితాంతము వ్యాపృతమా ధ్రువమ్ముగఁ.

వ. ఇవ్విధమ్మున నమ్మాణిక్యపురాధీశ్వరుకొమిరె త్రిలోకసుందరి జాతకమ్మునందలి యోగమ్ములకును సౌందర్యాతిశయమ్మునకును నల

రుచు మంత్రిపుంగవుం డాపె జననవత్సరంబు మొదలుకొని లెక్కించి
యవ్విభున కిట్లనియె. ౧౫౮

మ. పదిరెండేఁడులు దాఁట లేదుగద! యీబాలామణీపాత్రియ మీ
యదనం బెండ్లికిఁ దొందరేమి? నృపకన్యాపాణిపీడావిధుల్
పదికొక్కండనుగూడ బాల్యదశలో వర్తింప వేనేఁటికో
విదులో జేండ్ల రజస్వలాపరిణయంబే లే దటందు రొప్పరిన్. ౧౫౯

ఉ. ఇందుమతీస్వయంవరము నేమనుకోఁదగు? ద్రౌపదిన్ మత్తే-
మందము? బాల్యమందున స్వయంవరణం బొనరించె నందమా?
యెందుకొ? మీ నృపాలమణి యింతటి చిన్నతనంబునందె తా
నందనకున్ వివాహము నొనర్చు ప్రయత్నము నాచరించుటల్.

చ. అనవుడు మాన్నృపాలకుల యన్వయమందు రజస్వలాంగనా
జనపరిణీతి పూర్వనృపసమ్మతమైనను గారణాంతరం
బున నది చేయ మాని రొకపార్తి రజస్వలయై వివాహమున్
గనకయె స్వర్గ మేగెనఁట? కారణ మింతియె వేఱు లేదిఁకన్. ౧౬౧

క. అది మొదలు బాల్యముననే
ముదమలరఁగఁ బెండ్లి సేత మొదలిడి రయ్యా
పద మరల నెపుడుఁ గనరా
దదియే యాచార మయ్యె నన్వయమునకున్. ౧౬౨

వ. నావుడు మంత్రి తనలో నియ్యది తనపన్నఁబోవు పన్నాగమ్మునకు
మిక్కిలి యనుకూలంబని తలంచి సంతసింపుచు నవ్విభున కిట్లను.

చ. అవు నిటువంటి వెందుఁ గల వస్మదధీశులవంశమందు భూ
ధవులు వధూగళమ్మునకుఁ దాళి స్వయంబుగఁ గట్ట నేగ రా
హవవిజయప్రదాయి యొక యాయుధమున్నది దాని నంపి వృ
ద్ధవు తమవంశయాజకుని హస్తముచే జరిగింతు రావిధిన్. ౧౬౩

ఆ. వె. అర్థ ముండ దిట్టి యాచారములకు శా
స్త్రంబు మొదలె సున్న ధర్మవేత్త
లిట్టిపట్ల శంక యే మాత్రమును జేయ
రన్యయాచరణము లనుమతింతురు. ౧౬౫

క. సీమంతము జరిగింపరు
భూమిసురులు కొంతమంది పుత్త్రికలకు సే
సీమంతిని యో దాన దు
రామయమున బ్రుంగి పోయెనఁట! ము న్నెపుడో ! ౧౬౬

తే. గీ. శోభనపు నాఁటియుదయాన శ్రోత్రియవ్రు
వరులు విచ్ఛిన్నమగు నగ్ని మరల నిలిపి
హోమములు సేయుదురు దీని నొక్క కొంద
ఱాచరింప రేదియొ నష్టి గోచరించి. ౧౬౭

వ. శాస్త్రమ్ము విధించుచున్నను నిట్టిసదాచారమ్ముల నెన్నిటినో కులా
చారమ్ముల పేరను దేశాచారమ్ముల పేరను నుల్లంఘించుట కను
పట్టెడి నని వెండియు. ౧౬౮

ఆ. వె. వరుఁడు మీకు నచ్చి వధువు నీక్షించుచోఁ
బెండ్లికొడుకు రాఁడు పెండ్లి కత్తి
నంపి జరిపికొనుటె యస్మదాచార మిం
దులకు నృపతి యేమనునొ? కనుంకు. ౧౬౯

వ. మా రాజుల కులాచారాదులు మీకు నచ్చి యావద్విషయంబును
స్థిరపడిన పదంపడి యంతఃపుర పరిచారికలు వచ్చి కన్నియ నీక్షిం
తురు, పిమ్మట సుముహూర్తనిశ్చయం బొనర్చి మీకుం దెలుపం
బడెడి నని గంభీరమ్ముగా నొడువుటయు నిది యెల్ల నల్లరత్నాం
గదున కెఱింగింప నా పెండ్లిపెద్ద లరిగిరి. ౧౭౦

క. నరపతి విప్రులవలనన్
జరిగిన సకలమ్మెఱింగి స్వకుమారి నిడన్
ద్వరపడియెన్ భుజగ మటం
చెఱుఁగఁడు రాజులకుఁ జారులేకద? కన్నుల్. ౧౭౧

వ. పదంపడి ధర్మాంగద నృపాలుండు మంత్రియనుమతమ్మునఁ బెండ్లికిఁ దరలి చని వివాహమహంబు నిర్వర్తించుకొని కోడలిని వెంటఁబెట్టుకొని మంగళోదర్కంబుగాఁ గోటలోనికిఁ బ్రవేశించె. ౧౭౨

## ఆ శీ ర్వ చ న ము

క. ఆయుష్యం బారోగ్యం, బాయీ ద్వితయంబు మఱియితోఽధిక సంపత్సాయుజ్యము శేఖరునకుఁ, బాయక భగవంతుఁడిడున పారయశమ్మున్

గద్య.

ఇది శ్రీ తిరుపతి వేంకటీయం బగు పతివ్రత యను
ప్రబంధమ్ము నందుఁ బ్రథమాశ్వాసంబు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ మత్పరదేవతాయై నమః.

# పతివ్రత

## తిరుపతి వేంకటీయము

### ద్వితీయాశ్వాసము

వ. పదంపడి యయ్యుపన్యాసకుండా సదస్యుల నుపలక్షించి సంబో
ధించి యనంతరచరితం బిట్లుపన్యసించె. ౧

తే. గీ. ఈ రహస్యమ్ము బయటికి నెక్కకుండ
మంత్రి యెంత గుప్తమ్ముగ మాటుపఱచు
శాసనములు విధించిన దాసులకత
మున నిజము బయటికి నెట్లొ పొక్కె మున్నె. ౨

తే. గీ. ఎవరిమట్టుకు వారలే "యెవరితోడ
జెప్పవల"దని చెవులలోఁ జెప్పికొనఁగఁ
దొడఁగిరి వివాహముంగూడఁ గడఁగి చేయు
పిదప మంత్రిపై నీసది పెచ్చుపెరిఁగె. ౩

ఉ. పుట్టునుగాక సర్ప మది పూర్వజనుఃపరిపాక మెవ్వరున్
గట్టిన పుణ్యపాపములు "కా" దని త్రోయఁగ శక్తులే? యఘ
మ్మిట్టి దొనర్పఁగాఁ దగునె; యేమని రాట్సుతఁ గట్టిపెట్టె బల్
దట్టుఁడ నంచు మంత్రి; యిది దారుణకృత్యము కట్టి కుడ్పదే. ౪

చ. తనమతి రాచకార్యములఁ దద్దయుఁజూపి నృపాలుమన్ననన్
గొనుటది యొప్పుఁగాక యిటుగొంతుకఁ గోయునె? రాజపుత్రిబో

మున కెరచేసి; పాపమును బున్నెము నుంతయు లేదె? దుష్ప్రవ
ర్తన మన నింతకన్నఁ గలదా? యిలఁ దాఁగొల దాఁగ నేర్చునే.౫

తే. గీ. ముక్కుపచ్చ లారనికన్నె లక్కటకట!
అక్కడక్కడ తలిదండ్రు లమ్మకతన
గోడు గుడుచుచు నున్నారు కొంద ఱదియు
నిట్టి దనరాదు పాముల కేరు సీరు. ౬

ఉ. చేయునుగాక మంత్రి తనచేటు బయల్పడ నే కుతంత్రమో
సీ! యన కెట్లు ఱేఁడు వినెఁ జే పెదియో కనిపెట్టుకుండెఁ బో!
పాయక యీనృపాలునకుఁ బాపము! పెండ్లికొమార్త కెట్టులో
యీయఘు మెల్లఁ దెల్లమగు నెంతగ మూసినఁ బాసిపోయెడిన్.

తే. గీ. ఱేఁ డమాత్యునిపట్ల మోమోటుఁగాక
రాణివాసం "బిటుల్ సేయరా" దటంచు
భర్తతోఁజెప్పి మరలింప వలదె? రేపు
కోడ లడిగిన నేమని యాడఁగలదొ? ౮

క. తనబిడ్డ పాము యైనను
దనకున్ ముద్దగునుగాక దానికి నెవరున్
దను నిందింపరు దీనిని
విని సైఁతురె? తోడి రాజవీరులపత్నుల్. ౯

తే. గీ. ఇంత యెందుకుఁ గడుపుననే జనించి
నట్టిఁడే కద! నాగేంద్రుఁ డాపెటొమ్ము
గుడిపి పెంచెనె? కోడలిఁ గొడుకు సెజ్జ
కెట్టు లంపింప నెంచె నీనృపునిరాణి. ౧౦

క. తనవంటిది కాదే? యా
జననాథుతనూజ; యెట్లు సర్పంబును గ

న్గాని భీతిలకుండెడి నని
మనమున యోజించె రాజమహిషి మహిషియే? ౧౧

ఉ. పాములఁ దాల్చు శంకరుఁడు పార్వతిఁ బెండిలి యాడుపట్ల నా
స్వామి త్యజించి పాములను బార్వతిపాణి గ్రహించె నందు రా
స్వామినియే భయంపడిన సర్పముతో నిఁకఁ గాపురంబు నిం
కీమహిఁ జేయు నేమహిళ; యేమని స్వామిని దీని కొప్పెనో? ౧౨

క. కనులుండి కూడ నంధులు
జనపాలకు లనెడిమాట సత్యమ యేమం
చు నొసంగెఁ గన్నియను నల
మనుజేంద్రుఁడు కూఁతుమగఁడు మనుజుఁడొ? కాఁడో? ౧౩

చ. అతని ననంగరాదు నృపునాత్మజుఁడంచు నొసంగెఁ గాని పా
మితఁ డని యెట్లు బోధపడు? నిందలిదోషము సర్వమున్ మహీ
పతియును మంత్రియున్ గుడువఁ బాల్పడెఁగావలె, రాజభార్యన
మ్మతి మఱియున్ విచార్య;మెటునున్నెడి నీయెదుటొమ్మ్మకుంపటిన్.

తే. గీ. ఇప్పు డీడేరకున్కి నెల్లెల్లొ పులిమి
పుచ్చెదరుగాక నేఁడొ! రేపో! నృపాల
కన్య యీడేఱు నపు డత్తగారిపాట్లు
కుక్కలకు నుండ వుండవు నక్కలకును. ౧౪

ఉ. అప్పటిదాఁక నెందులకు? నంతిపురమ్మునను న్నపెట్టెలోఁ
జప్పుడు సేయు పాముఁ గని సాధ్వి, యిదేమిటి? దత్త యంచుఁ దా
నిప్పుడు గాకయున్నఁ బయి నెప్పుడు నేనియుఁ బృచ్ఛ సేయ నే
చొప్పునఁ జెప్పునో? స్నుషకు సూనృతవాదిని యత్త యత్తటిన్. ౧౫

క. కావలసినదే యీపెకు
సేవగఁ దా నొప్పుకొన్న దిందుకు విధిగా.

నేవగ గుడువఁగ నబ్బిన
నీవిభుసతిఁగూర్చి వగచు టెంతయు దోసఁగా. ౧౭

తే. గీ. ఎంత రాణివాసమ్మున కిక్కయేని
యక్కమలనేత్రి యువరాజు నడుగకుండుఁ
గాని యత్తను; జాటుగా నేనిఁ జూచు
తలఁపు గొనకున్నె? యెట్లిది దాఁగ నేర్చు?. ౧౮

క. యువరాజు వేఁటకేగుట
యువరాజెటకేనిఁ జనుటయును నటులుండఁగ
యువరాజు తల్లిఁ జూడం
గ వచ్చుటయులేమి శంక గలిగింపదొకో? ౧౯

క. ఇవి యన్నియు నెందుకు నే
"నవుకరు" యువరాజు పేరు నాలుకతోఁ బ
ల్కఁ వినెడి భాగ్యము నోఁచమి
నవయదె? నరపాలుసుతమనము పలుగతులన్. ౨౦

క. కళవళపడి నృపపుత్త్రిక
చెలికత్తెల నేని యెపుడో చెలిమిని నడుగం
దలపెట్టదె? యీడేఱు ట
వలఁ జూతము నేఁడె బయటఁ బడుఁ గుట్టెల్లన్. ౨౧

ఉ. పామును బెట్టెలో నునిచి భామిని సాఁకుట కర్థ మెట్టులో
స్వామినినెచ్చెలుల్ పులిమి స్వామి సమర్చఁగ బొంక వచ్చు నె
ప్డేమియు రాజపుత్త్రి గుఱియించినవార్తయె లేమి నెట్లు కన్
బ్రామఁగ వచ్చు? నెంతటి భర మ్మిది రాజగృహాన కెమ్మెయిన్.

ఉ. కత్తిని జూపి కోడలిని గ్రిక్కున నంతిపురమ్ముఁ జేర్చె న
త్యుత్తముఁ డీ నృపాలుఁ; డిఁక నున్నది పండుగు "బాబుపెండ్లికిన్

జిత్త మెలర్చెఁ దా సవతి చిన్నమ దాపుర మయ్యె" సర్వమున్
గత్తియె నిర్వహింపవలెఁ గన్నియతండ్రి కెఱుంగవచ్చుచో. ౨౩

క. వియ్యంకుఁడు రత్నాంగదుఁ
డియ్యావమతి సైఁచు టెట్టు? లిది తుద కెట్లో
కయ్యమునకుఁ గారకమై
దయ్యము విడిపించు మంత్రి తలఁ పెట్టిదియో. ౨౪

వ. ఇట్లు పురమ్మునందలి స్త్రీపురుషాదు లెల్లరును వారివారికిఁ దోఁచి నట్లు తమలోఁ దామ గుసగుసలు వోవుచుండిరి, పెండ్లికుమార్తయుఁ దనభర్తనుగూర్చిన సడి బొత్తిగా వినరామికిఁ గతంబు తనలోఁ దాన వితర్కించుకొనుచుఁ గాలంబు గడపికొనుచు యుక్తవయస్సున నీడేఱి [నగరుఁబెండ్లి లోనగు ముచ్చట లేమియు లేమిం జేసి యంతకు మున్న యంకురించిన సందియంబు మఱింత సందడిం గొలుప నయోమయమ్మగు డెందమ్మున వందురుచు సిగ్గున మ్రగ్గుచు. ౨౫

క. ప్రతిదినముఁ గడుపునఁ గను
సుతుపగిదిన్ బేర్మిఁ బెంచుచున్ బాముపయిన్,
మితిలేని వత్సలత్వ
మ్మతికిన తన యత్త నడుగ నాత్మఁ దలంచెన్ ౨౬

చ. తలఁచియు నత్తయేమనునొ? తాదృశకారణ మేమి యున్నదో?
యిలఁ బలుమంది పాములకు నెంతయు భక్తి నమస్కరించి పూ
జల నొనరించు టున్నయది షష్ఠికి నేఁటికి నొక్కమాటు నా
గులయుల చౌతికిం గలదు కొండొక యప్పుడు గానరా దెటన్. ౨౭

తే. గీ ధూపదీపనైవేద్యవిధు లిటుఁ గాన
రావు మంత్రి తంత్రిమ్ములమాట వినఁగ

రాదు రాజోపచారమ్ము లేదినమ్ము
జరుపు చున్నా రిదేటి ప్రసక్తి యొకో! ౨౮

ఉ. పాముకు తేనెకిన్ బలెనె పల్వురు నౌకరు లేటికో? గడున్
గోమలమైన సెజ్జ యనుకూలములైన తలాడ లేటికో?
ధామమునందుఁ బెంచెడికతం బది యెట్టిదొ? అత్తగా రిటుల్
ప్రేమము చూపు టెట్టిదొకో? వెఱ్ఱిగఁ గన్పడు నాకు నీకతల్.

ఉ. కత్తిని బెండ్లి కంపు నలకారణ మెట్టిదొ? అత్తగారిమో
ముత్తలపాటుతోఁ బాగులు నొక్కపుడున్ వగ పీడినట్లు లే
దెత్తెఱఁగొకో! నన్నుఁగని యేమొకో? మిక్కిలి చింతనొందు త
చ్చిత్తము; కారణం బడుగఁ జెల్లునొ? చెల్లదొ? సాహసమ్మెటుల్.

వ. ఇవ్విధమ్మున నవ్వెలంది నానావిధభావంబులకుఁ దావలంబై వల
వంతకు లోనై సిగ్గున మ్రగ్గుచు "నిద మిత్థం" బను నిర్ణయమ్ము
గనరాక యొక్కొక్కతఱి వెక్కివెక్కి పొక్కుచు మరల నుపశ
మిల్లుచుఁ దనచక్కఁదనమ్ము నిందించుకొనుచుఁ దనమనఃపరితా
పమ్ము తనకుఁ దక్క వేఱొక్కరికిఁ దెలియని ఫక్కిఁ గొండొక
కాలమ్ము నపనయించి నానాఁటికి నంతులేక పెరుఁగు విచారమ్ము
నకుఁ బారమ్ము గానక యంతర్గతంబున. ౩౧

ఉ. ఆఁడుదియై జనించుట ప్రియాసకు హేతువు; దాని కొప్పినన్
జేఁడులకున్ జనించుట మఱిన్ బ్రళయాంతము, పెండ్లి వెంటనే
యీడకు వచ్చితిన్ గనన యెన్నఁడు భర్తముగంబు; తండ్రికిన్
జాడ యెఱుంగఁ జేయు టది క్షత్రియపుత్రిక కెట్లు భావ్యమా. ౩౨

చ. కులసతి కోర్కి కన్గొనలకున్ జవదాఁటగ రాదు పల్కు ల
ర్మిలి గల భర్తకర్ణములు మించి వినంబడరాదు మోవిపై

నిలుచుట తప్ప నవ్వవల నెవ్వానరా దీక్షఁ గోప మన్న లో
పల నిముడ న్వారెల్ల యశము పై ననురాగము గల్గు సాధ్వికిన్. 33

తే. గీ. అపయశముతోడ బ్రదుకుట యబల కొక్క
రితకె కాదు పురుషునకు నితయె యందుఁ
బురుషుకన్నఁ బూఁబోడికిఁ గరము నపయ
శమ్ము గర మగు బ్రదికియుఁ జచ్చినట్లె. ౩౪

చ. ఏమని నెమ్మదిన్ గలచు నీవగఁ దెల్పుదు నేతు; దండ్రి కిం
కేమని తల్లి కేని యిది యే భరియింపఁగ లేక వీఁక నే
కామినియో బలెన్ జెలిమొగమ్మున నేని యెఱుంగఁ జేతు స
ద్భామిపుఁ బుత్రినై; కడచి పోయిన దీని కతండు పూఁటయే. ౩౫

వ. అదియునుంగాక ప్రస్తుతవిషయం బిదమిత్థ మని తెలిసం గదా! యెంతులకేని గడంగుట? ఇయ్యది యయోమయంబుగఁ గన్పట్టెడి నని యెండియు. ౩౬

చ. కొమరుఁడు చేని కున్నటులు గోచర మించుక గాదు లేఁడు పో ?
కొమరుఁడు; కోడ? లేమిటికి గోష్ఠుల నెన్నఁడుఁ గాని యేనృపో
త్తముఁడును గోడలిం గొనఁడు తా ననపత్యుఁడె యయ్యు; నిట్టి చి
త్రిమకట!నాతలం బొడమె దైవము చెయ్దు దురూహ మెమ్మెయిన్

ఉ. పాములఁ బూజ సేయుదురు భామలు కొందఱు సంతు కోస; మీ
కోమలి యత్త యందులకొకో? భుజగేంద్రునిఁ బెట్టెఁ బెట్టి తా
నేమమునన్ యజించు; టిది నిక్కమయా నెడ నెప్పుడో సుతుం
డామెకుఁ బుట్టుఁగాక యిపుడాయనకు న్ననుఁ బెండ్లి సేతురే? ౩౭

ఉ. ఉత్తమురాలు గాని మఱి యెందు విధంపు నెలంత గాదు నా
యత్త; మహానుభావుఁ డలయార్యుఁడు మామ యొకప్పుడేని గిం

చి_త్తఘమముం బొనర్ప రని చెప్పక చెప్పెడి వారి చెయ్దముల్;
రి_త్తకు రిత్త గా నను వరింతురె? కోటకు నిట్లు తెత్తురే!. ౩౯

వ॥ అని కొండొక యోజించి వెండియు. ౪౦

శా. ఏకార్యమ్మునకేని దూరవిషయంబే యేగి రాఁడయ్యెనో!
లే కీవేళనా రేపా వచ్చునా! జగల్లీలల్ విలోకించుచున్
రా కాలస్యము సేయుచుండెనో! కటా! ప్రాణేశుఁడెందేని యీ
లోకంబుల్ విడనాడియే చనెనో! యేలోపంబు చేకూరెనో. ౪౧

వ॥ అని మరలఁ దనలోఁ దాన "పాపము శాంతించుఁగాక" యని
మంగళదేవతాస్మరణంబు చేసికొని. ౪౨

క. "నిమ్మకు నీరె_త్తినయటు"
లిమ్మహిపతి యూరకుండునే! యచ్చట లో
పమ్మేదియు ఘటియించిన
నెమ్మెయి ననుకొనఁగఁ బోల దీవిషయమ్ముల్. ౪౩

మ. ఇటు చింతించుచు నొక్కనాఁ డడిగె నేమేనిల్ సరే యంచునె
క్కటిగా నుండి సఖీమణిల్ బిలిచి "అక్కా! మీ నృపాలాత్మజుం
డిట నున్నట్టులు లేదు వేఱెచటఁగానీ యున్నచందంబు ని
ప్పటి కొండ్లు స్వచియించుకో రెఱుఁగుచో వాకుత్తువే నా కొగిన్.

క. అని తెగి యడిగిన నెచ్చెలి
కనుఁగొలుకుల నీరు జాఱఁగా భోగీంద్రుం
డనయము వసించు పేటిక
జననాయకసుతకుఁ జేతిసన్నన్ జూపెన్.

ఉ. చూపినయంతఁ జూచి యలసుందరి ధైర్యము బిగ్గఁబట్టి లో
నాఁపగరాని దుఃఖభర మాఁగి ఘొసల్ బతిఁగాంచి మొక్కి-దై

వోపహతిన్ ఘటించెడిని నోగును బాగును వానికిఁ వృథా
లాపులు దక్క నోర్ల మెడలఁ రుష నింపరు ప్రాజ్ఞులెవ్వరుఁ. ౪౬

చ. కనుపడు బాహ్యహేతువులు కష్టసుఖమ్ముల కెన్నియేని; యో
జనఁ గనుఁగొన్న నందెదియు సత్యముగాఁ గనుపట్టు; దొక్కటే
అన్నృతము గాగ నిల్చు; నది యాత్మపురాకృతమే; అదెప్పుడే
ననుభవమున్వినా సురుఁగ, దారసి చెప్పిరి పెద్ద లీనుడిఁ. ౪౭

చ. శివున కెదో విపత్తియు శచీపతి కేదొ విపత్తి ధాత యా
భవునికతమ్మునం దలకుఁ బాయుటయున్ దలపోసి చూడఁ గా
లవశమ కాక వేఱొక బలమ్ము గిలమ్మును గల్గునే! త్రిమూ
ర్తి విభులు దాఁట నేర రని తేలెడిఁ గాల మెవండు దాఁటెడిఁ. ౪౮

సీ. రామునంతటి వాఁ డరణ్యాని భార్యతోఁ
గందమూలాశియై కస్తిగుడిచె
నలుఁడు పొందిన కష్టములు విచారించుచో
శిలయేనియు ద్రవించి వెలుకఁబాఱు
నలహరిశ్చంద్రుఁ డిల్లాలితో ననుభవిం
చిన కష్టములు విన మనసు బెదరు
ధర్మరాజాదులు ధర్మాత్ములై కూడ
ననుభవించిరి కదా! ఆపదలను

తే. గీ. బాహ్యకారణములు గనుపట్టు వీని
కన్నిటికిఁగూడ లెస్సగా నరసి చూడ
నాంతరంగికహేతుసామగ్రి గోచ
రించు విజ్ఞుల కదియు గణీయ మెందు. ౪౯

సీ. సీతపే రెవ్వరు చెప్పికొందురు రావణుం డాపెఁ జెఱఁబట్ట కుండెనేని
ద్రౌపదిపేరి కంతటి వాసి గల్గునే? దుర్యోధనుఁడు నీతిఁ ద్రోలఁగఁ డేని

దమయంతికట్టికష్టములురాకున్నచో, నంతటిప్రఖ్యాతియబ్బునెట్లు?
సావిత్రిఁ బోలెడి సాధ్వులెందఱులేరు, హేతు వబ్బక కీర్తి కెక్కరైరి

తే. గీ. నాకు భగవంతుఁ డీదృశశోక మనుభ
వించుటకు నేదో కతము నూహించి యుండ
వలయు లేకున్న నాయనపట్ల నే నొ
నర్చిన యవజ్ఞ గలదె? యేనాఁడు గాని. ౫౦

తే. గీ. అరణియం దగ్ని యుండుఁగా కది మథించి
నప్పుడె ప్రకాశముంగను నట్లె ప్రాణి
నిష్ఠమగు గుణ మగుణంబు నెమక నెంచి
దారుణంబగు కష్టంబు దైవ మొసఁగు. ౫౧

తే. గీ. దానిఁ దప్పించు కొనఁ బ్రయత్నంబు సేఁత
కన్న నద్దాని కోర్చుటే కడు శుభంబు
కాయ మెందుకొసంగె నకారణికుఁడు
సుఖము దుఃఖము ననుభవించుటకె కాదె? ౫౨

క. అని తనయుత్తను దనమా
మను గానీ లేశమేని మనమున దూఱం
గను నొల్లక దైవకృతం
బని మానిని ధీరచిత్తయై తగ నుండెన్. ౫౩

చ. ఎపు డల పెట్టె నుండిన యహీంద్రుఁడు ప్రాణవిభుం డటంచు న
చ్చపలమృగాక్షికిం దెలిసె సాధ్వి తదాది తదీయమైన య
య్యుపచరణంబు సర్వమును నోపి స్వయంబుగ నిర్వహించు నొ
క్కపుడును బాలుమాల దిది యారసి యత్తయు నుత్తలంపడున్.

వ. ఇట్లు కొన్ని వారమ్ములు గతించుటయు ౫౫

ఉ. అత్త గ్రహించి యయ్యబలయం దధికాదరభావ ముంచి యా
వత్తు గతంబు దెల్పి "సచివప్రవరుండు భవత్పతివ్రతా
యత్తము మత్సుతోద్ధరణ" మంచు బుధుల్ వచియించి రంచు లో
కోత్తరసచ్చరిత్ర! నిను నోడక తెచ్చి నిజంబు చెప్పితిన్. ౫౬

క. సీతాసతికిన్ సావి
త్రీతరుణికి మఱియు ద్రౌపదికి దీటౌట! నీ
జాతకమహిమము నీదగు
పాతివ్రత్యప్రభావపటిమం బనదే? ౫౭

ఉ. ఎక్కుడు యోగ్యతల్ గలుగుచేసుమి! కస్తికి మాల; మెక్కడో
కుక్కినపేను నా నణఁగు కొండొకమానిసి లెక్క యేమి? యే
చిక్కులు తారసించినను జిక్కక చక్కనిఫక్కిఁ గీర్తి పెం
పెక్కఁ జరించు ప్రాణులె కవీంద్రులకైతకు జీవనౌషధుల్. ౫౮

క. వారు పడిన కష్టమ్ముల
పారములే యయ్యె నెల్లవారును వారిన్
దారకమంత్రముపగిదిన్
పారక జపియింత్రు గాన వారలె ధన్యుల్.

వ. ఆ ధన్యచరిత్రలయందును బతివ్రతామహిమం బసాధారణం బనుట
కెన్నియో యుదాహరణంబులు గలవు.

క. ఎప్పుడున్ దీరిక నెఱుఁగక
ప్రపంచకోపకృతికొఱకుఁ బర్యటనము సే
యు పరోపకారి రవి యొ
క్కపతివ్రతమాట దాఁటఁగా భయపడఁడే! ౬౧

వ. అని వెండియు. ౬౨

చ. కపటము జేసి నీదుజని క_ర్తికి నగ్గ మొనర్చునట్టి పా
పఫుఁబని కేము సిద్ధపడి పల్కెడి పల్కులు సిగ్గుచేటు నీ
కృపకతనన్ గులం బిది తరించు నటం చొనరించినట్టి యే
వపుఁబని కీవు సైఁపవలెఁ బ్రాజ్ఞవు నీవికఁ బెక్కు లేటికిన్. ౬౩

ఉ. లేమరో! కాన్పుభాగ్య మది లేకయె కొండొకకాల మేగె నే
నోములొ నోఁచి దానము లస్నానము లెన్నొ యొనర్చుచుండఁగన్
బా ముదయించె నేను దొలిబాముఁన జేసినపాప మెట్టిదో!
యే మనుకొందు నిందులకు నే వగవన్ యువతీమతల్లిరో. ౬౪

ఉ. నిన్నుఁ గుమారికామణి ననీదృశభాగ్యపరీత నిత్యసం
పన్నసదన్వయప్రభవఁ బాతక మంచుఁ దలంప కక్కటా!
బన్నముపా లొనర్చుటకు బాలరో! నే దురపిల్లుచుంటి ముం
దెన్నఁడొ కల్గుయోగ మది యెవ్వరు చూచినవారు తల్లిరో!. ౬౫

మ. కల రెందుం బలుకష్టముల్ గుడిచి వేడ్కల్ పిమ్మటన్ గాంచువా
రిలలోఁ బల్వురు; నీకతాన నటులే యీమాకు సౌభాగ్యముల్
గలుగున్ జ్యోతిషికుల్ వృథా వలుక రో కాంతామణీ! నమ్ము మ
ర్మిలి మాపైఁ బరఁగింపు మున్నదిసుఖీ? మేల్ చాల దాదాపునన్

ఉ. నావుడు నప్పతివ్రత మనంబున నప్పలు కాశిషమ్ముగా
భావనఁ జేసి య_త్త కిటు వల్కెను మీమది నన్నుఁగూర్చి చిం
తావిలమాట కే వగతు నంతియకాని ననున్ గుఱించి నా
కేవిధమైన చింతయు నొకింతయులేదు యథార్థ మింతయున్. ౬౭

చ. జనులకుఁ గర్మమే సుఖ మొసంగును గష్ట మొసంగు నవ్వుచున్
బొనరిచి యేడ్చుచున్ గుడువఁ బోలునె? యెం తవివేక మద్ది; మీ
మన మది నాకునై వగపు మానిన దానన నాదునుద్యమం
బనఘ మగున్ సమ_స్తము జయం బగు నాదగుకోర్కి యింతియే.

చ. హృదయమునందొకండు పయి కింక నొకండునుగా జగమ్మునం
బొదలుదు రెందఱో; యుభయమ్మున్ సరిగాఁ గల మిమ్మువంటి సౌ
హృదము గలట్టి పుణ్యసతి కెవ్వతె కోడలొ? యాపెభాగ్యసం
పద గణనీయ మందులకు భాజన మైతి నిఁకేమి కావలెన్. ౧౯

ఉ. జ్యోతిషికుల్ వచించునుడి సత్యమకాఁ జరియించి మీతనూ
జాతునకై మనుష్యజనిసంగతికై యిలనెల్ల తీర్థముల్
చూతు యజింతు దేవతల జోత లొనర్తుఁ బతివ్రతాత్వవి
ఖ్యాతికి వన్నెఁ గూర్తు నిడుఁ డాశిషముల్ ననుఁ బంపుఁ డర్మిలిన్

క. "అర్మిలి" యను మీనామము
శర్మదమై నాకు జయ మొసంగు యశ మిడున్
మార్మాట వలుకకుఁడు మీ
యర్మిలి కంజలి ఘటించి యభ్యర్థింతున్. ౨౧

చ. అనవుడు నత్తగా ర్కనుల నశ్రులు కాల్వలుగట్టఁ దల్లిరో
జనపతిపుత్త్రివై సకల సౌఖ్యములుం గలదానవై సుమం
బున కెనయైన నీ వకట? భూమిఁ గలట్టి సమస్త తీర్థముల్
చను టెటులమ్మ? కొన్ని సుఖసాధ్యము, లెన్నియొ కష్టసాధ్యముల్.

క. శకటాది సాధనమ్ములు
వికటపు మార్గముల నేగు వీ లొదవమి నూ
రక నడిచి పోవలయు నీ
కకటా! శక్యంబె? యెట్టు లరిగెదు? తల్లీ. ౨౩

క॥ భావన కుదిరిన దేహమె
దేవళమగు నందె యెల్లతీర్థమ్ములు దా
మావేశించును దల్లీ!
కోవిదురాల విది నీ కొకారు చెప్పెదరే? ౨౪

సీ. ఉండనేరవు మహోద్దండసౌధాధిత్య
కాభాగములఁగాని కాంచనాంగి!
పండనేరవు వ్యాళవద్భాసితూలికా
తల్పమ్ములనెకాని తలిరుఁబోఁడి!
నడువనేర వనర్ఘనవరత్నకంబళో
పరిభాగములఁగాని పద్మగంధి!
నుడువ నేరవు రత్న నూత్న పంజరశారి
కలతోడనేకాని కలికిమిన్న!
తే. గీ. ఇట్టి నీవేడ? తీర్థమ్ము లేడ? వాని
సేవన మదేడ? లేరొకో? దేవతలు స్వ
గృహములందును దేవతాగృహములందు
వారి సేవించి కోర్కులు వడయు మబల! ౨౦

క. దాసీదాసజనమ్ముల
తో సరసిజనయన! యేగుదువుగా కపుడుఁ
గాసికి మూలమె తీర్థస
మాసేవన మీవెఱుంగ వబలామణిరో! ౨౧

క. హిమవత్పర్వతపు సమీ
పమునం గల తీర్థములు దపస్వులకును దు
ర్గమములని చెప్ప విందుము
సమస్తతీర్థములు చనఁగ శక్యంబగునే? ౨౨

వ. జగములు సృష్టిసేయుటకు సాక్షి లయించుటకుఁ సమర్థురా
లగు నలపార్వతీజనని యాత్మకు నీశ్వరుభర్తఁ జేసికో
నోగిఁ దప మాచరించుటకు నొప్పక తల్లి యెటుల్ వచించెనో?
మగువ! యెఱుంగవే? సుగమమా! జగమంతయుఁ జుట్టివచ్చుటల్.

క. కావున నిచ్చటనుండియె
కావింపుము జపముఁ దపముఁ గరుణించు నినున్
దేవుఁడు తప్పక నీస
ద్భావము నీపతికి మనుజభావ మొసంగున్. ౭౯

చ. అన విని సుందరీరమణి యత్తకు నిట్లను నా కనుజ్ఞ ని
చ్చిన నొకబీదరాల్పగిదిఁ జేసెద యాత్రలు భర్తతోడ; జీ
వనమునఁ బ్రీతి యున్న యెడఁ బైనెట నేమగునో? యటన్న భీ
మనమును బట్టి గుంజు నది మాలిన నా కెట కేగ నేమగున్. ౮౦

మ. పతికిన్ మానవభావ మేర్పడుట కే బ్రహ్మణ్యులన్ మ్రొక్కి పూ
జితులన్ జేయుట యొప్పొ? తాదృశమునీట్పవామహాభాగ్య మే
క్షితిఁ బ్రాప్తించునొ యింట నున్న సతికిన్ జేకూరు టెట్లమ్మ? భూ
గతతీర్థమ్ములనెల్లఁ జూచు నెడ భాగ్యంబున్న సిద్ధించెడిన్. ౮౧

ఉ. సంతతి నిచ్చునట్టివి పిశాచములన్ వదలించునట్టి వే
చింతయుఁగూడ మాన్పెడివి సేతుహిమాచలమధ్యభూప్రదే
శాంతరమందుఁ దీర్థము లనంతముగాఁ గల వండ్రు నమ్మి సే
వింతుమయేని నిక్కమగు వృద్ధమునుల్ వచియించు వాక్యముల్.

మ. గుడులన్ జూడఁగ గోపురమ్ములు గనన్ గొండల్ విలోకింపఁ బె
న్మడుగుల్ దేశవిచిత్రముల్ నదు లరణ్యంబుల్ తరుల్ గాంచ నే
గెడువారే పలుమంది; దేవుని మదిన్ గీలించి సేవింపఁ బో
యెడివా రుందురు తైర్థికుల్ శతములో నే యొక్కరో! యిర్వురో!.

చ. నృపయువతీలలామకు సరీసృప మేల జనించెఁ జెప్పఁ డం
చెపుడు ననేకతీర్థముల కేఁ జని యందలి దైవతమ్ములన్
దపము కతాన లోఁగొని యథార్థ మెఱింగి మనుష్యభావమున్
గృపమెయి హా వొసంగుటకు నేఁ బ్రియమతింతు ప్రతస్థురాలనై.

ఉ. పాముననే జనించు నొకపామునుగూర్చి మనుష్యభావ మే
పాములు వడ్డఁ గల్గుట కుపాయము లుండక పోవుఁగాక యీ
పాము మనుష్యభావమునకుఁ బాపమొ? పుణ్యమొ? హేతువై గదా?
స్వామిని! తా జనించె మనుజత్వము గాంచు నుపాయ ముండ దే. ౮౭

ఉ. ఉండిన నుండుఁగాక యటు లుండకపోయినఁ బోవుగాక భూ
మండలతీర్థముల్ తిరిగి మందులు మాకులు మంత్రతంత్రముల్
దండిగ నేర్చు యోగులపదంబులకుం బ్రణమిల్లి యత్నముల్
మెండుగ నే నొనర్తు నొగి మిమ్ము ననుజ్ఞ యొసంగ వేడెదన్. ౮౮

క. మును పొక్క జాతిబండకు
వనితాత్వము గలిగెఁ బతితపావనుఁడౌ రా
మునిపాదరజముకతమున
నని విందుమకాదె? యుందు రట్టిమహాత్ముల్. ౮౯

క. మణిమంత్రౌషధులును ముని
మణులును దీర్థములు లోకమంగళకరముల్
ఫణికి మనుజత్వ మిడుటకు
నణుమాత్రము లేదు సందియము నాదుమదిన్. ౯౦

క. వెదకవలెఁగాని యెంతటి
సదమలపుణ్యాత్ములేని జగతిం గల రా
పద పైఁబడినప్పుడు నే
వెదకక యెవ్వారు వారి వెదకెడివారల్. ౯౧

క. తక్షకవిషదగ్ధం బగు
వృక్షపుభస్మమును బోగు వెట్టి యొకద్విజా
ధ్యక్షుఁడు మంత్రించి మరల
వృక్షముగాఁ జేసినట్లు విందుము కాదే? ౯౨

వ. మఱియు నింక నిట్టి వెన్ని యో పురాణమ్ములం దత్యద్భుతమ్ము
లుగా నుండియు యథార్థమ్ము లగు విశేషమ్ములు విననయ్యెడి.
నయ్యవి వక్కాణించినవారు లోకవంచకు లని పలువురు నిరసింతురు
గాని వారు యథార్థ మరసినవారు కారు. ప్రయత్న లోపంబునం
జేసి కాని యయ్యది తగినంత సమకూరిన యెడ సిద్ధింపని కర్జం
బొండుండదు. "యత్నే కృతే యది నసిద్ధ్యతి కో౽త్ర దోషః" అను
నార్యుల వచనము సర్వథా సమాదరణీయంబు, త్రోసివేయఁదగ్గది
కాదని వెండియు. ౯౧

చ. "నను సెలవిచ్చి పంపుఁ" డను నాతికి రాణ్మహిషీలలామ యే
మిని బ్రతి చెప్పలేక యిది మిక్కిలి తప్పిద మే విధాన ని
య్యనుచిత మాఁగుదాన నని యాత్మనలందురి మామగారితో
మనవి యొనర్తుఁ బాళు మనె మానిని సమ్మతి చెందె నందుకున్.

వ. పదంపడి యయ్యగ్రిమలీమహాదేవి తనయంతర్గతమ్మున, ౯౩

ఉ. ఏమని విన్నవింతు నృపుఁ డే గతి నిందుకు సమ్మతించు నే
బాముసఁ జేయు పాతకమొ? పామును గంటిని, గందుఁగాక పెం
డ్లేమని చేసె మంత్రి ధరణీశు కొమార్తను మాయ పన్ని; దు
ర్ధీమహితత్వముల్ దుదకు దెప్పరమై యిటు ముప్పు దెచ్చెడిన్.

మ. అకటా! యిట్టి పతివ్రతాతిలక మేమన్నన్ మహాస్త్రంబుపో
లిక దుర్దాంతమహోజ్జ్వలజ్జ్వలను పోల్కిన్ జుట్టును న్మట్టి మం
త్రికులమ్ము న్నరనాథువంశము నిదం దేశమ్మునుం బూరిపు
ల్లకును న్మారక యూరకే చెడునటు ల్గాలించి తూలించదే!. ౯౫

శా. పామున్ గన్నది తేనిరాణి యని చెప్పన్ దోస మేముందు "నే
మో ? మాపుణ్యపురేఖ యిట్టి" దని యామోదింతుమేగాని యీ

బూమెల్ రావుగదా ? యెదో ? కపటమ్ముఁ బొల్పంగ నానాఁట నే
కే మేక్షై విషమించె నిప్పు డెట్టులో యీగండమ్ముఁ దాఁటుటల్.

క. కపటమునకు ననృతమునకు
నపరిమితస్నేహ మిదియు నయ్యదియును నె
ల్లపుడుఁ గలిసి వర్తించెడి
నెపుడో నట్టేట ముంచు నివి మానవునిన్. ౯౭

మ. కపటద్యూతపుఁ గాఁణాననకదా ? కౌరవ్యవంశమ్ము ధూ
మపరీతంబయి దుమ్ము దూళి యయి సంపాదించె లోకానకుఁ
విపరీతమ్మగు నష్టి; సూనృతపరుల్ విశ్వైకవంద్యుల్ విభుం
డపకీర్తిం బడి కుందఁగా వలసె మంత్ర్యజ్ఞానమూలమ్మునన్. ౯౮

చ. ఇపు డనుకొన్న నేమిఫల? మెప్పుడు మంత్రికిఁ దోఁచె నిట్టి దు
ష్కపటము; తత్క్షణంబ "యది కార్యముగా" దని యాఁగనైతి నా
చపలతగూడ నాతనికి సాయ మొనర్చె నృపాలుఁ డిందు నిం
ద పడఁడు మంత్రిది న్మఱియు నాయదియుఁ దొసఁగిందు సర్వముఁ.

సీ. రత్నాంగదుఁడుమహారాజవరేణ్యున
కనుఁగుఁగూఁతురు గాఁగ జననమంది
ధర్మాంగదుం డను ధర్మరాజునకు న
ల్లారుఁగోడలు గాఁగ నవతరించి
మూఁడులోకమ్ముల నీడులేని సురూప
మును గుణాఢ్యతయును నసుగమించి
ఎండకన్నానక న్నెఱుఁగనిరాణివా
సమునఁ బుట్టినదాది సంచరించి

తే. గీ. కలికి తుదకుఁ బాములపెట్టె తల ధరించి
బిచ్చకత్తెవిధాన నిప్పచ్చరముగఁ

తీర్థముల వెంటఁ దిరిగెడి తిరిపపుదశ
కెట్టు లొప్పుదు వారింతు నెట్టు లింక. ౧౦౦

శా. పాతివ్రత్యకళాభిరామ మగు నిప్పద్మాక్షి నెమ్మోమునం
దే తీర్థమ్ములు దేవతల్ మునిజనుల్ దీపించుచున్నారు లో
కాతీతం బగు తేజ మీపెయెడలన్ వ్యాపించి నర్తించు నీ
జ్యోతిఃపుంజము గాంచి నంత నెవఁడున్ జోతల్ సమర్పింపఁడే!

తే. గీ. ఈపె సంకల్పమును ద్రిప్ప నేరికిని ద
రంబుగా దొప్పికొంటయు రాజగృహపు
లక్షణము గాదు భావిఫలంబుమాట
దెట్టులున్నను గర్తవ్య మేమి నాకు. ౧౦౨

తే॥ గీ॥ మొదట నొకతప్పునకు నొప్పఁ దుదకు నది య
నేకములు తప్పిదములు చేయించి తీరు
నింత యెఱిఁగియు మొదట నే నెందు కొప్పి
కొంటి మంత్రిరి చేసిన కొంటెతనము. ౧౦౩

క. అని పలువిధములఁ జింతిలి
వనితామణి భర్తఁ గాంచి వలవంత కత
మ్మున వాకు రాక తుదకే
మిని దోఁపక యిట్లు పలికె మించిన వగతో. ౧౦౪

తే. గీ. కోడలికిఁ దీర్థయాత్ర లేగుటకు నాజ్ఞ
వలయునఁట? నాకుఁ దెల్పెను వాంఛితమ్ము
భర్తతోఁగూడఁ జనునఁట! పాలుపోక
మీకుఁ దెల్పితి నెయ్యది మీఁది తెరువు. ౧౦౫

చ. అన విని ఱేఁడు రిచ్చవడి, యక్కట! చిక్కెది యెట్లు తీరు? నే
మనుచు సరీసృపమ్మునకు నట్టి శుభాంగిని మాయ పన్ని పెం

డ్లని పొనరించె మంత్రి; యది నే నెటు 'కా'దన కియ్యకొంటి న
క్కనకనిభాంగితోఁ బలుకఁగాఁ దగు నుత్తర మేది? యిత్తఱిన్.

ఉ. మంతిరి తెచ్చిపెట్టె వెడమాయపుఁ బన్నిక పన్ని దీని నే
"నంతకు నాతఁడే కలఁ" డటం చొకభంగి నుపేక్ష చూపుటే
యింతటి పుట్టిముక్కఁ కగుహేతు వుపాయ ముపాయముం గదుం
జింత యొనర్చి యేపనియుఁ జేయనగుం విషమించుఁ గానిచో.

తే. గీ. ఐన మించినపని కిప్పు డతనిఁగూర్చి
యేమనిన నేమి లాభించు? నింక మీఁద
నేది కర్తవ్యమో? చూచుటే హితంబు
సచివు నాశయమును బృచ్ఛ సలిపి చూతు. ౧౦౮

వ. అని యేకతంబుండి యమాత్యు రప్పించి. ౧౦౯

చ. నరపతి యాతనిం గని మనంబున నున్న విషాదముం బర
స్పరముగఁ దెల్పినంత సచివప్రవరుండును గొంత సేపు "కి
క్కురు" మన కూరకుండి నృప! కోడలు తీర్థములెల్ల నాడఁగా
నరుగునుగాక భర్తఁగొని; యయ్యది మేలొనఁగూర్చుఁగా కొగిన్.

తే. గీ. ఆపె కెచట నేయాపద యడరకుండ
నల్ల భగవంతుఁడే కలఁ డట్లని మన
మూరకుండంగ రా దెట్టులో యతించి
యాపెఁ గాపాడవలయు గోప్యముగురీతి. ౧౧౧

ఉ. జాతకముం బచించు బుధసత్తమువాక్కునఁ గల్గునమ్మికన్
భూతలనాథ! నేను బువుఁబోఁడిని బొముకుఁ బెండ్లి సేసితిన్
బాతకి నౌదునో? తుదకుఁ బార్థివమంత్రుల కెల్ల మిన్ననై
ఖ్యాతి గడింతునో? పిదపఁ గాలమె తెల్పునుగాక వీఁకమై. ౧౧౨

క. భిక్షాటక వేషమున న
నుక్షణముఁ వెంట సతి ననుగమించుచు నే
నీక్షింతుఁగాక యాపెం బ
రీక్షింతుంగాక యెట్టిరీతిన్ జనునో? ౧౧౩

ఉ. నీకొక చింత వల్దు మనీషివరేణ్యు లసత్య మెన్నఁడున్
వాకున కంటనీరు ఋజువర్తన యాపెకతాన నిక్కమే
నీకొమరుండు సర్వప్రజనిన్ విడి మానిసియై స్వరాజ్యమున్
జేకొని యేలు నింతయును సిద్ధముగాఁగనుపట్టు భూవరా! ౧౧౪

శా. పాము ల్లోకమునందు లేవె? కనమే? పామన్నఁ బామెక్కొ? యీ
పా మేపామునకున్న పీసాఁబగు లాఘాలాత్ము సేవించు న
ప్పామో? శ్రీహరిఁగొల్చుపామొ? యగు నీపా మేదొ? నీపుణ్యరే
ఖామాహాత్మ్యము హేతువై పొడమె నీకాన్పై ధరాభృన్మణీ.

క. ఏపుణ్యక్షేత్రమ్మున
నో? పా మిాబాము విడుచు నోఁగీఁ గుబుసముఁ దా
నేపగిది విడుచు నట్టులె
నీపుణ్యం బపుడు పండు నృపతిలలామా! ౧౧౬

చ. కుబుసములోన నున్నయది కుత్సితసర్పము గాదు భూమియె
ల్లఁ బడగలందుఁ దాల్పఁ గల లావు గలాఁ డలశేషునంశ యిూ
యబలపతివ్రతాత్వమున కక్కజ మందిరియొ? తీర్థరాజవ
ర్తిబహుమహత్తనో? నరవరేణ్యుఁ డగున్ క్షితినేలు సాధ్వితో. ౧౧౭

ఉ. పాములకున్ మనుష్యులకు బాంధవ మిప్పటిది కాదు గూఢచా
ర్గాత్రిమణియైన వాసుకికి గాదిలిసోదరి నొక్కభూసుర
గ్రామణి పెండ్లియాడి సుతుఁ గాంచె నతం డల యస్తికుండు స
ర్వామయకారి సర్పమఖ మాఁగుట భారతసుప్రసిద్ధమే. ౧౧౮

వ. ఇట్లు సచివుం డేవేవియో గాథ లుపన్యసించి ఱేనిమనమ్మునకు భావి
కాలశుభంబునెడ విశ్వాసమ్ము గలిగించి తీర్థయాత్రాచరణం బం
దుల కావశ్యకం బని యంగీకరింపఁజేయుటయు ధర్మాంగదుం డితి
కర్తవ్యతాశూన్యుండై పట్టమహిషికిఁ దనసమ్మతిం దెలుపుచు
చేసె. ౧౧౯

చ. పదపడి యుత్తమామలకుఁ బావనశీల నృపాలపుత్త్రి స
మ్మదమున మ్రొక్కి బీదద్విజమానినియున్ బలె నోలిఁ గాల్నడన్
బదములు దొట్రిలంగఁ దనభర్త వసించెడిపెట్టె యొాఁదలన్
ముదిత ధరించి తా వెడలెఁ బూర్జనులెల్ల విచార మందఁగన్. ౧౨౦

వ. ఇట్లు శుభోదర్కంబగు సుముహూర్తమ్మున నంతిపురమ్ము వెడలి
చను నయ్యసూర్యంపశ్య తీర్థయాత్ర కరుగుచు. ౧౨౧

సీ. ముత్యాలపేరు లిమ్ములఁ దీసి రుద్రాక్ష
మాలికల్ ధరియించె మగువమిన్న
అగురుగందము మాని ఆపాదమస్తకం
బంగనామణి భస్మ మలఁదికొనియె
కస్తూరితోఁ దిలకమ్ము దిద్దెడి మోము
నందుఁ గుంకుమమాత్ర మతివ తాల్చె
చీనిచీనాంబరా లూను నెమ్మేన న
న్నాతిమిన్న ధరించె నారచీర

తే. గీ. పూలు భూషణములు దాల్చు పొలఁతి తలను
మట్టుగాఁ జుట్టకుదు రొండు వెట్టికొనియె
భర్త యున్న పేటికఁ దాల్చి పడఁతిమిన్న
తీర్థయాత్రార్థనై బయల్ దేఱె నిట్లు. ౧౨౨

మ. కనువారల్ గనలేక యశ్రుమయమై కంపించి రా సాధ్వి యే
మిని శంకింపక జంగమాంగనబలె న్మెల్మెల్లఁగా జంకుఁ గొం

కును బోనెట్టుచుఁ గాల్న డర్ జనియె నాకుఁ భర్త మేల్ దక్కఁ ద
క్కిన దింకేదియు వల్వ దంచు మదిలోఁ గీడెంచి మే లెంచుచున్.

సీ. పనికిమాలిన మంత్రి పాపాన కొడిగట్టె
నే మనం గల దంచు నెంచువారు
ఆఁడుఁబుట్టువు పుట్టదా ? అంతిపుర మెట్టు
లంగీకరించెనో ? యనెడివారు
ఎంత ప్రాభవ మున్న నింత యాంధ్యం బున్నె
యంచుఁ గన్నియతండ్రి నెంచువారు
మంత్రి పన్నుగా కమాయపన్నాగంబు
ప్రభు వెఱుంగఁడె యంచుఁ బల్కువారు

తే. గీ. వారి ననసేల? యెంతటివారి కేని
దైవకృతములు దప్పింపఁ దరము గావు
తెలియ కొరుల వృథాగ నిందించుకొనుట
యనెడివారునునై పౌరు లడలుగొనిరి. ౧౨౪

ఉ. "మంత్రిరి" యంచు నే పలికిమాలినవానికి పేరు పెట్టి శ్రీ
మంతులు వాఁడొనర్చునది మంచియొ? చెడ్డయొ? యంచుఁజూచుకో
కంతిపురమ్మునందొ? మృగయావ్యసనమ్మునయందొ? డింది ని
ద్రింతురు దానఁ గీడు లిటు రేఁగు భరింపఁగరాని వెన్నియో.

వ. అని వెండియు. ౧౨౬

ఉ. "సీత యరణ్యమేగె" నని చెప్పఁగ వింటిమి కాని చూడ లే
దీ తలిరాకుఁబోఁడిఁ గను కేర్పడె, నీమెకుఁ బాము తోడు, ప్ర
ఖ్యాతధనుర్విదగ్రిణులు కాంతుఁడు పైని మఱందిగూడ నా
సీతకుఁ దోడు, కష్ట మిది చెప్పి మఱొక్కటి చెప్ప నొప్పునే? ౧౨౭

చ. కలరు పతివ్రతల్ తగుమగండు లభించిన వాని దేవుఁగా
దలఁచుచు సర్వదా యతనిఁ దత్పరతన్ భజియించి సంసృతిన్
గలిమిని లేమి నొక్కగతిఁ గాలము పుచ్చెడివారు, పాములన్
దల భరియించు సాధ్వులకతల్ విన మెక్కడ నే యుగమ్మునన్.

సీ. అలయహల్యయు దమయంతి సీతాసతి
ద్రౌపదియును నరుంధతియు స్వాహ
మండోదరియుఁ జంద్రమతి శచియు సుకన్య
గాంధారి సావిత్రి కలికిమిన్న
లిట్టివా రెందఱో యెల్లెడలను బతి
వ్రత లున్నవారు తత్పతులు స్వీయ
జాతివారలె కాని సారెసారె విసమ్ముఁ
జిమ్ము పాములును వ్యాఘ్రమ్ములు మొద

తే. గీ. లైన ఘోరజంతువులు గా రకట ? ప్రకృత
మట్టి విషమసంధిని బరీక్షార్థ మొక్కొ ?
సంఘటించె నీశ్వరుఁ డది సాధ్వి లెక్క
పెట్టక తరించె నీపె కే వెలఁది సాటి. ౧౨౯

చ. పురుషు లదృష్టవంతులఁట ; పోల్తురు గారఁట ? కొంత స్వాంతమం
దరసిన సాధ్వియౌ తరుణియంఘ్రిరజంబున నొక్క రేణువున్
సరిపడఁదూఁగ నెట్టిరును జాలరు పూరుషు; లొక్కదీనిచేఁ
దరుణి జయించు స్వర్గమును ధారుణియున్ శివవిష్ణులోకముల్.

మ. అకటా! యిట్టివ్రతంబుఁ బోవిడిచి గయ్యాళుల్ సతుల్ గొంద ఱా
డికపాలై పలుపోకలం బడి దెవో శెక్కుల్ వెలారించుచున్
సుకవుల్ సీ, యన రెంటికిం జెడి కడున్ శోచ్యస్థితిం గాంతు రా
పెకలుల్ కారణమై జనించుఁ జెడుగుంబే రెల్లస్త్రీజాతికిన్. ౧౩౧

ఉ. అక్కఱలేదు వేదములయధ్యయనంబులు, శాస్త్రబోధనం
బక్కఱలేదు సాహితియు నక్కఱలేదు జపంబునన్ దపం
బక్కఱలేదు దానములు నక్కఱలేదు పతివ్రతావ్రత
మ్మొక్కటి చిక్కినన్ గెలుచు నుగ్మలి లోకము లొక్కవ్రేల్మిడిన్

క. యమునంతటి క్రూరుఁడు సా
ధ్వీ మొగమ్మును దేఱిచూడ వెఱచి తనప్రభు
త్వము గోలుపోయి "దాసో
హ" మనెఁ బతివ్రతకు జగము లడలుట యరుదే? ౧౩౩

తే. గీ. అల్ల దమయంతి కను విప్పి యరయునంత
బోయ నీఱయ్యె, నచ్చరపూవుఁబోండ్ల
బలిమిఁ బట్టిన రావణు తులువతనము
సీతయెడ గడ్డిపోఁచయుఁ జేయదయ్యె. ౧౩౪

క. పాతివ్రత్యవ్రతమున
కీ తరుణీమణికి వార లెవరు సరియుఁ గా
రీతన్వికతన జగమే
పూతము మనభాగ్యగరిమ పొగడఁగ నేలా? ౧౩౫

క. అని యీవిధమునఁ బౌరులు
తనుఁగని యనుకొనుచు నుండఁ దన్వీమణి యే
గెను ముక్కుకు సూటిగను శ
కునములు శుభసూచకములు కుతుకముఁ బెంపన్. ౧౩౬

మ. ఎదురైరి ద్దఱు బ్రాహ్మణోత్తములు పై నేతెంచె సింగారపున్
మొదవు ల్లేగలుఁ;బిమ్మటన్ దధిఘటమ్ముల్ తోఁచెఁ బువ్వారుఁబోం
డ్లెదురైరి ఱబ్జముమీఁది ఖంజనముఁ దా నీక్షించె మద్యంబు న
య్యదనం దోవ నెదుర్పడెన్ సతికిఁ గార్యంబైనటుల్ కన్పడెన్.

క. అడుగులకు మడుగు లొత్తెడి
పడఁతులసందడిని మెలఁగు పద్మాక్షికి నే
బడలిక యాఁకలి దప్పిక
నడయెడఁ గనఁబడక నడిచె నానాఁటి కొగిన్. ౧౩౮

## ఆ శీ ర్వ చ న ము

క. ఎవనికొలమ్మునఁ బొడము శి
శువులకుఁ గల బుద్ధిమత్త సూరిజనులకున్
స్తవనీయ మ్మగు నాతఁడు
గవిభక్తుఁడు శేఖరుఁడు సుఖము గనుఁగాతన్. ౧౩౯

### గద్య

ఇది శ్రీతిరుపతివేంకటీయం బగు పతివ్రత యను
ప్రబంధమ్మునందు ద్వితీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ మత్పరదేవతాయై నమః.

# పతివ్రత

## తిరుపతి వేంకటీయము

## తృతీయాశ్వాసము

వ. అనంతరం బయ్యుపన్యాసకుం డవ్వాలి చరిత్రించు సదస్యులకు నిటు
లుపన్యసింపఁ దొడంగె. ౧

క. జనపాలురాణి తనతన
యునియెడఁ బాటునకు వంత నొందుచుఁ గాలం
బును నెట్టుచుండెఁ గోడలి
గొనములు దనమదికి శాంతి గొంత యొసంగన్. ౨

క. కడుపున నిడి మోసిన ప్రే
ముడి సంతతి యెట్టిదైన మోహమ్మెదకున్
గడలు కొలిపి పీడించెడిఁ
బడఁతుల కని వేఱ చెప్ప వల దిల యెఱుఁగున్. ౩

ఉ. పాముగుఁగాక ప్రత్యహముఁ బాలనుబోయుట మల్లెపూలతోఁ
గోమలదారు సెజ్జ నొడఁగూర్చుట ధూపసువాసనల్ కడున్
దీమునఁ బ్రాఁకఁజేయుటయు దేవునకున్ బలె సంతరించు నా
భూమిపురాణి కెంత చినఁబోయెడినో! సుతుఁ డుండు గీమహా. ౪

క. కొడుకుం గోడలుఁ గంటం
బడుదురు లోకమ్ముతోడిపాటుగ ననున

య్యెడియాస కతమ్ముఁన నా
బిడయెడఁదకుఁ గొంత తొలఁగె బెంగ క్రమముగన్. ౫

ఆ. వె. అలన రేండు ప్రొత్తి యలన రేండు నిప్రొత్తి
భాతి పాముపెట్టె భయము విడిచి
నెత్తిఁబెట్టుకొని చనినమీఁద మంత్రియు
వెంబడించె భిక్షువేష మూని. ౬

ఉ. మంతిరియన్నచో నతఁడె మంతిరి; భిక్షుకవేషమూని యా
యింతి యెఱుఁగ నయ్యెడకు నేకతమేగుచు లేశమున్ బరి
శ్రాంతి గణింప కాత్మనృపసంతతికిన్ శుభ మిచ్ఛగించుచున్
మంతనముల్ బయల్పడనిమార్గిఁ జరించెను జాగరూకుఁడై. ౭

మ. హిమవత్పర్వత పుణ్యభూమికడ నే యే తీర్థముల్ మున్ పురా
ణములన్ విన్నదొ? యాపెయందు మొదటన్ స్నానమ్ముగావింప న
క్కమలాక్షీమణి భర్తకున్ మనమునన్ గల్యాణ మర్థించి యే
గె మునీంద్రాశ్రమవాటికల్ గని వెసన్ గేల్మోడ్పు లర్పించుచున్.

వ. ఇట్లు కతిపయప్రయాణంబు లొనర్చి యేగియేగి. ౯

చ. కనియె నదీనదాంబుకణ కాండపవిత్రిత వాతపూత పు
ష్పనికరవాసనాప్రసర పాంథపురాకృతకర్మదుర్మదా
పనయనదక్షవృక్షగతపక్షికలస్వనబంధురంబు ని
ర్జనవనగంధసింధురధురంధరమున్ హిమభూధ రేంద్రమున్. ౧౦

వ. అప్పర్వతేంద్రప్రాంతంబునందును నుపత్యకాధిత్యకలందునుం గల
తీర్థరాజమ్ము లెల్ల సేవించి తత్తదధిష్ఠానదేవతల కెల్ల దనమనో
రథంబు నివేదించి వెండియు. ౧౧

క. గంగ జనించినచో టది
"గంగోత్రి"యటండ్రు దానికడ కేగుట ని

స్సంగులు మునులకుఁ దక్కఁ గ
డుం గడ్డచ్చటికి నెవ్వఁడున్ జన వెఱచున్. ౧౩

శా. ఆ "గంగోత్రి" జలమ్ములన్ మునిఁగి యయ్యబ్జాక్షి భర్తృస్థమా
నాగత్యంబు దొలంగుఁ బొంటెఁ బెలుచన్ దచ్ఛైత్యబాధాసమా
యోగప్రాప్తిచురి లోఁగి మాఱ్పడిన నందున్నట్టివా రమ్మహా
భాగన్ దేర్చిరి వహ్ని నూల్కొలిపి; యప్పద్మాస్య తేఱె న్వెసన్.

వ. తేఱి భర్తన్ గూడఁ బదిలమ్ముగా స్నానంబు చేయించి నిటలతట
ఘటితకరపుటయై యిట్లు నుతించె. ౧౪

శ్లో. అంగోద్భవాహితజటాపటలప్రసంగే
రంగత్తరంగ కనదుత్తమహంససంఘే
తుంగాఘసంఘశమనప్రకటాంగసంగే
గంగే కృపాం మయి విధేహి కృపాంతరంగే. ౧౫

శ్లో. నమ స్సమస్తామయభంజికాయై
నమ స్సుపర్వాలయమార్గదాయై
నమో రమానాథపదాబ్జజాయై
నమో నమోఽనంతసమప్రభాయై. ౧౬

శ్లో. వరదే పరదేవతేఽతిపూతే
నరదేవాహితవిష్టపప్రచారే
కురు దేవి! నిరంతరం ప్రసాదం
హర! దేహాశ్రిత మావిలం ప్రభూతమ్. ౧౭

శ్లో. విద్యాం విశేషయతి పాప మపాకరోతి
సంతాప మపానుదతి సందధతే శుభాని
పుష్టిం వివర్ధయతి హృ ద్విమలీకరోతి
గంగా నకిం కిమపి దాతు మహో సమర్థా. ౧౮

వ. ఇట్లు సన్నుతించి వెండియు. ౧౯

సీ. పుట్టు వందితి వీవు భువనపావనమైన
యలరమారమణు పాదాబ్జసీమ
నిను ధరించె శిరాన నిఖిలగీర్వాణుల
కారాధ్యుఁడైన యయ్యాదియోగి
హైమవతీదేవికన్న నెక్కుడుగాఁగఁ
నినుఁ బెంచికొనె హిమానీధరంబు
యోజనశతము నందుండి నీపేరు ప
ఠించఁ బాపము పటాపంచలౌను

తే. గీ. తల్లి! నేఁ దొల్లి చేసిన యెల్ల పాప
ములను బోకార్చి నా భర్త కెలమి మనుజ
భావము ఘటించి ప్రోచి నీ పావనత్వ
మెందును బ్రసిద్ధిఁ గన నుతికెక్కుమమ్మ! ౨౦

శా. వ్యాధుల్ డుల్లు, సురుంగు నాధులును, బాపంబుల్ పటాపంచలౌ,
బోధం బుప్పతిలున్, శుభంబు లొలయున్, బున్నెంబు చేకూరు, ని
ర్బాధంబౌ సకలం, బపాయ మడఁగున్, భక్తిన్ భవన్నీర మా
రాధింపంగను బ్రాణికోటికి నుమాప్రాణేశ్వరప్రేయసీ. ౨౧

మ. జననీ! స్త్రీలకుఁ బుట్టుతోఁ బొడము సంసారమ్మునన్ వాంఛ; నీ
కనుభూతం బిది, శంతనుండు పతిగా నాత్మోద్భవున్ భీష్మునిన్
గనినా వీవు, ఫణిన్ హృదీశ్వరునిఁగాఁ గైకొంటి నే నార్తనై
నిను సేవించెద మానవత్వ మిడి మన్నింపంగదమ్మా! కృపన్.

క. బాలిక లాడెడి యాటల
లో లీనంబగుచుఁ దోఁచులోకపు సంసా
రాలోచనములు ఫణితో
నేలా సంసారవార్ధి నీఁదుదుఁ దల్లీ! ౨౩

ఉ. పేటికనుండి "బుస్సు" మనుపెన్మిటితోఁ జనుదెంచితిఁ జగ
న్నాటకసూత్రధారులకు నా వలవంత మనంబు సొచ్చి యే
నాఁటికి నేని నాదుమొఱ నాటి భవాదృశ పుణ్యతీర్థసం
గాటనపుణ్ మిషఁ గలుగుఁగాక కృతార్థత యన్న నమ్మికన్. ౨౮

శా. నీతీరమ్మునఁ గీటపున్ జనన మేనిన్ మాననీయంబ యం
బా! తక్కుంగలచోట్ల మిన్నయగు సామ్రాజ్యాధిపత్యమ్ముతోఁ
జేతఃప్రీతి నెసంగనేనియుఁ బరశ్రేయస్సుపట్లన్ వృథా
మై తీరున్ బురుఁగేగు సద్గతికి దేఁ డర్హుండు గాఁ డెమ్మోయిన్.

చ. పురుఁగున కేని యీశ్వరునిపోల్కి సురూప మొసంగఁ జాలు నీ
కరుణకు సర్వమున్ మనుజుఁగా నొగి మార్చుట యక్కజంబుగా
దెఱుఁగుదుఁగాని కర్మమున కెవ్వరుఁ గర్తలు గారు బల్ దురు
ద్ధరమది కేవలానుభవదాస్యమునం జెడు నద్ది యీశ్వరీ. ౨౯

వ. ఇట్టు లాతీర్థమ్మునఁ గొన్నాళ్ళు వ్రతపరాయణయై నివసించి శీతో
ష్ణాదిద్వంద్వమ్ములకుఁ దలంకక యటనుండి "జమ్నోత్రి" యను
యమునాజననస్థానమ్మునకు నరుగు యాత్రికులతో నయ్యెడకుం
జని.

శా. దానం దాన మొనర్చి తన్నది మనోధామమ్మున న్నిల్పి "నీ
దానం దల్లి! యనుగ్రహింపు" మనుచున్ దైన్యంబు దైవాఱ నా
సూనుప్రోద్భవ వేడి మ్రొక్కిడి హృదీశు న్నాగమున్ జూపి "యే
మేని న్నీవ శరణ్య" మంచు నిటు లయ్యేణాక్షి పల్కెన్ బొరిన్.

శా. అమ్మా! నీవును నాఁడుదానవెకదా? ఆత్మీయదృష్టాంతమున్
నెమ్మి న్నాకయి నెమ్మదిం జొనిపి నా నేరమ్ము లేమేని యు
న్న మ్మనించి భవన్మనోవిభుఁడు కృష్ణస్వామి శ్రీపాదప
ద్మమ్ముల్ మూర్ధమునన్ ధరించు ఫణిభర్తన్ మానిసిన్ జేయవే

మ. నదివై యుండియు స్త్రీస్వభావ మెటులున్ దప్పించుకోలేక య
య్యదునాథున్ వరియించి సంసృతిసుఖం బర్థించి కాళింది నా
గ దిగంతమ్ములఁ బేరు మ్రోఁగితివి మత్కాంతున్ ఫణీంద్రున్ భవ
త్పదదాసున్ మనుజన్మునిఁ జేయఁదగదే? త్వన్నాథశయ్యాకృతిన్.

తే. గీ. కామరూపిణివే నీవు గాకయున్నఁ
గామినీరూప మేగతిఁ గాంచి కృష్ణుఁ
గలియ నేర్తువు మత్పతిఁ గామరూపుఁ
జేయు మంబ! నమస్కృతుల్ సేతు నీకు. 30

శా. నీనాథుండు విషాహిఁ గాళియు భవన్నీరాశయావాసియై
నానాకశ్మలతా నిధానముగఁ దన్నారంబు దోరించు దు
ర్మానిన్ వానికళత్రిముల్ సలుపు మొఱ్ఱన్ బట్టి రక్షించె స
న్మానింపంగదవమ్మ! మానుషునిఁగా నానాథు నామొఱ్ఱచే. 3౨

క. పతియే గతి మానినులకుఁ
బతికన్న శరణ్య మొండు పడఁతికి లే దీ
గతి నీ వెఱుఁగుదు నాదు
ర్గతిఁ బాపఁగదమ్మ? నీకుఁ గావింతు నతుల్. 33

ఉ. పుట్టినయింట నున్నయవి భోగము లెన్నియొ? అత్తవారియిల్
పట్టునఁగూడ సర్వసదుపాయము లున్నవి సర్వముండి నేఁ
బట్టపురాణి నయ్యు భగవంతునిచెద్దు ననాథపోల్కి ని
క్కట్టుల కగ్గమైతి ననుఁ గావుము తల్లి! నదీమతల్లివై. 34

శా. నీతీరమ్మునఁ గృష్ణదేవుఁడు జగన్నిర్మాతకున్ ధాతకున్
జేఁతంగాని విశేషముల్ నెఱపె నా శ్రీకాంతుతోఁ జెప్పి మ
చ్చేతఃకాంతు ఫణీందుని మానుషజనుశ్శ్రీమంతుఁగాఁ జేయరా
దే! తల్లీ! భవదీయమహా నుపకృతిన్ దేవాదు లగ్గింపఁగన్. 35

ఉ. మోసముఁ జేసి మానిసిని ముందుగఁ జూపి యొకేనియున్ రసా
భాసపుఁబెండ్లి చేసె సచివప్రవరుం; డతఁ డిట్లు స్వార్థమున్
జేసి యొనర్పఁ డిందొకటి చేరిన దయ్యది జాతకార్థ వి
శ్వాసము నీవు దైవమవు శాస్త్రము నిల్పఁగ నీకుఁ జెల్లదే? ౩౬.

ఉ. నాదుకతమ్మునన్ భుజగనాథుఁడు మానవనాథుఁడై యశ
శ్శ్రీ దళుకొత్త రాజ్యమును జేయుచుఁ దల్లికిఁ దండ్రికిన్ హృదా
హ్లాద మొనర్చునంట! యిది యంతయు నాదగుజాతకమ్మునం
దే దయివాఱుచున్నదఁట! దేవిరో! శాస్త్రము నిల్పఁ జెల్లదే?. ౩౭

ఉ. దైవమునందు నమ్మికకతమ్మున మంత్రి యొనర్చినాఁడు నా
భావిశుభోదయమ్మునెడ భావము పూర్తిగ విశ్వసించి స
ద్భావుఁడు పాముపెండ్లి; యలదైవము నిక్కమొ! లేక బద్ధమో!
నీవో! మఱొక్కదైవతమొ! నీతికి నిల్చి వచింపఁ జెల్లదే? ౩౮

తే. గీ. లేదనెడివారియెడలను లేదుగాని
కలదనెడివారి యెడలను గలదటంద్రు
దైవమే గల దనియెడిదానఁ గాన
దైవసత్త నిరూపింపఁ దగదె? నీకు. ౩౯

సీ. నామామ లోకసన్మాన్యచారిత్రుఁ డే
యపకార మెపుడు చేయండయేని
నాయత్త యల యరుంధతికన్న మిన్నయౌ
పరమపాతివ్రత్యభరిత యేని
నాతల్లిదండ్రు లున్నత కులోత్పన్నులై
నాయన్నలును జగద్గేయులేని
నామనోనాథుపుణ్యము గణ్యమగునేని
నాయెడందఁ గళంకు నాస్తియేని

తే. గీ. కలదయేనిఁ బాతివ్రత్య గౌరవంబు
కలరయేని దైవజ్ఞులు, గలదయేని
జాతకపుఁగళ, నృపుఁ డగుగాత నాహ్వ
దీశ్వరుండు ఫణీశ్వరుం డెప్పుడేని. ౪౦

వ. అని యందలి దేవతల నుద్దేశించి. ౪౧

సీ. అమృతమ్ముఁగోలుకునై యంభోధిజల మల్ల
కల్లోలముగఁ జేయు ఘనులు మీరు
దూరాక్షసుల బాధ తొలఁగించుటకు విష్ణు
నవతరింపఁగఁ జేయు నలఘు లీరు
తిమ్మి బమ్మిని బమ్మిఁ దిమ్మిగాఁ జేయఁగాఁ
జాలినంతటి మహాశక్తు లీరు
కర్త మకర్త ముద్ధర్త మనుద్ధర్త
మన్యథాకర్తుం సమర్థు లీరు

తే. గీ. మీరు తలఁచినఁ గానిదేమేనిఁ గలదె?
తీర్థములయందు మీరు వర్తింతు రనుచు
నెఱిఁగి మిమ్ముఁ బ్రార్థించెద సిద్ధులార!
ఆర్పుటకుఁ దీర్చుటకుఁగూడ నాధ్యు లీరు. ౪౨

వ. ఇట్లు తత్తత్తీర్థవర్తు లగు దేవతలం బ్రార్థించుచు గంగాయమునా నదీ తటస్థితంబు లగు హరిద్వార గోకుల బృందావనాదుల నెల్ల సేవించుచు. ౪౩

శా. కేదారేశ్వరు మ్రొక్కి హింగుళకునై కేల్మోడ్చి పద్మాక్షు శ్రీ
పాదాంభోజములందు సాఁగిలి వెసన్ బద్మాక్షి కాశీట్కృపా
స్వాదామోదముతోడఁ గాశికిఁ జనెన్ బౌరుల్ తనుం గాంచి "యే
మీ! చారాత్మ్యశ్రీ" మటంచు బ్రహ్మ యెడఁ బేర్మిన్ బ్రసారింపఁగన్.

వ. అట్లేగుచు దూరమ్మున నుండియె యత్తలోదరి కేల్మోడ్చి య
మ్మహాక్షేత్రమ్ము నుద్దేశించి. ౪౫

శా. పాకానీక కళత్రసంకుల భవాపస్మార దూరోగ దూ
రీకార ప్రవణ ప్రకృష్టతర నీరేజాక్షపాదాబ్జ మా
ధ్వీకూలాంచల కాంచనాచల దరీ దేవాలయోల్లాసి సు
శ్రీక త్ర్యంబక పాదదాసి బుధరాశిన్ గాశి వేశించెదన్. ౪౬

వ. ఇట్లు నమస్కరించి యప్పురమ్ము చొచ్చి. ౪౭

శా. గంగాస్నాన మొనర్చి పేటిక శిరోగ్రమ్మందుఁ గీల్కొల్పి పీ
ఠిం గంజానన బోనపుంబుటిక నెత్తిన్ దాల్చి యేతెంచు న
య్యంగప్రోద్భవవైరిభామినికిఁ బ్రత్యాదేశమో? నాఁగ నే
గంగా నంగన లెక్కరాపెను గనంగాఁ జంద్రశాలాగ్రముల్. ౪౮

సీ॥ అన్నపూర్ణాదేవి ఆఁకొన్న యతిథుల
కన్నమ్ము నిడ వచ్చె ననెడివారు
“తను మున్ను మోహించె” ననియేమొ ? విశ్వేశుఁ
గనవచ్చె మోహిని యనెడివారు
“ఏకారణముననో ? యింద్రుపైఁ గోపించి
చనుదెంచె శచి యిట్టు” లనెడివారు
“రతిదేవి తనభర్త బ్రతికించు నీశానుఁ
గనవచ్చె మ్రొక్కఁగా” ననెడివారు

తే. గీ. పార్వతీదేవి మున్ను తపఃప్రవృత్తి
నున్న తనరూపమును గాశి నున్నభక్త
జనమునకుఁ జూప నిటువచ్చె ననెడివారు
నైరి యాయింతిఁ గనుఁగొని పౌరులెల్ల. ౪౯

క. కనుఁగొని మ్రొక్కెడివారును
జనసంఘము మూఁగి బాట సాఁగనియెడ న
జ్జనుల నదలించి మార్గ
మ్మును జేసెడివారు నైరి పురజనులెల్లన్. ౫౦

శా. ఈరీతిన్ జనులెల్ల భక్తిమెయిఁ దన్వీక్షింపఁగా నాపె లో
కారాధ్యుండగు విశ్వనాథుగుడి డాయంబోయి భంభం ధ్వని
స్ఫారంబౌ నభిషేకమున్ సలుపు తద్భక్తాగ్రణీకోటి మో
కాటించెన్ దదనంతరం బభవు మోకాటించెఁ గై మోడ్పులన్.

( పా ఠా ౦ త ర ము )

శా. ఈవెంటన్ జనులెల్ల భక్తిమెయిఁ దన్వీక్షింపఁగా నాపె లో
కావాసుండగు విశ్వనాథుగుడి డాయంబోయి "భంభం మహా
దేవ" ధ్వానయుతాభిషేకములతో దేవేశు నర్చించు స
ద్భావుల్ భక్తుల మ్రొక్కి యీశ్వరుని సంభావించె నాపిమ్మటన్.

వ. అట్లు నమస్కరించి పేటికను దదగ్రమ్మునందు దించికొని. ౫౨

శా. పాముల్ నీకు శిరోవిభూషణములై భాసిల్లు నాకట్టులే
బాముల్ పాముకతానఁ జుట్టుకొనియెన్ భద్రమ్ములన్ గోరి నీ
నోముల్ నోఁచుచు నుంటి నాపదల నున్మూలింప నిన్ దక్కనిం
కేమూర్తుల్ గనరారు సంపదల నీ నేరేని శక్తాత్ములే? ౫౩

క. కలిగిన సంపద కే నే
వలఁతిని గానైతిఁ బూర్వభవపాపంపుం
గలిమి నిఁకేమని మరలన్
గలిమి నిడెడివారి వేడఁగా యత్నింతున్ ౫౪

ఉ. ఆపదలేని సంపదయె హాయి ఘటించునుగాని యాపదల్
ప్రాపుగనున్న సంపదలు ప్రాణికి సౌఖ్యముఁగూర్ప నేర వే

భూపతిపుత్రి నయ్యు నొకభూపతికోడల నయ్యు జోగినై
నీపదముల్ భజించుటకు నీగుడి కాపదకల్మి వచ్చితిన్. ౫౫

శా. ఏరాజన్యునికూఁతు రేని మఱి యింకేతేనికిం గోడలే
నీ రాఁగాంచితివే! బికారిగ నిటుల్ నీ యాలయప్రాంతమం
దో రాజార్ధకిరీట? ఆపదయె యీయోగంబు చేకూర్చె ని
న్నారాధించుచు నుంటిఁ బాపఁగదె? నాయాపత్తు నాపూర్తిగన్.

ఉ. సంపదకన్న నాపదకె జ్ఞానులు సంతసమందుదు ర్విచా
రింపరుగాక యంతటి ప్రకృష్టతరం బగు నట్టి జ్ఞానపుర్
సొం పొకయాఁడుదాని కెటు చొప్పడు? మున్ రతిదేవి నిన్నుఁ బ్రా
ర్థింపదె? భర్తకై పెఱసతీమణు లంతకు నెక్కుడౌదు రే? ౫౭

సీ. నీకన్న హరికన్న నీరజాసనుకన్న
నమరేంద్రుకన్న దేవాళికన్న
నెవ్వరికన్నను నెవ్వ రెక్కుడటన్న
శ్రీదేవి యనికదా! చెప్ప శ్రుతులు
ఆపె సంసారిణి యామె నీకర్థాంగి
యాకె లేకున్న నీ వసలె లేవు
ఒకట నుందువుగాక యున్నను లేనట్లె
యెందుకుఁ గొఱగాని దేటియున్కి

తే. గీ. మగువసాహాయ్య మది లేని మగని బ్రదుకె
అట్టిదైనప్డు మగని సాయంబు లేని
యట్టి మగనాలిజీవితం బడుగ వలెనె?
యీవు సర్వజ్ఞుఁడవు కావె! దేవదేవ! ౫౮

క. మగని నెఱుంగని మగువలు
మగనిం గోల్పోయినట్టి మగువలుఁ గల రే

దిగులును వారల కుండదు
మగఁడుండియు లేఁడయేని మగువ పొగులదే ? ౫౯
(పా) మగఁడు విషాహి యగునేని మగువ పొగులదే?

క. "నష్టేమృతే" యటంచు వి
శిష్టులు ధర్మమ్ము లరసి చెప్పుదు రది యే
భ్రష్టాంగనయో తక్కిన
నిష్టపడునె? యిష్టపడినయే నది సతియే ?

క. పతి యెట్టిఁడేని తత్స
ద్గతి కోరెడి సతియె సతి; యథార్థం బింతే
క్షితి "భర్తురేవ హిత మి
చ్ఛతి తద్ధి కళత్ర" మను వచన మది మృషయే. ౬౧

చ. ఎటిఁగియొమాయలోఁ బడియొ? యేకతమో?మగఁ డంచుఁ బాముకం
దఱు మెడఁ గట్టినారు ననుఁ; దల్లియుఁ దండ్రియు నత్తమామలున్
దురిత మెఱుంగ రింకొకఁడు దుష్టుఁడు గాకయు దుష్టునట్లమూ
తిరి సకలమ్ముఁ దా సలిపె దీని నెటో సవరింపు మీశ్వరా? ౬౨

ఆ. వె. "కాను బాధ్యురాలఁ గాను నే" నని తప్పి
కొన్న శాస్త్ర మొప్పికొన్నఁ బిదప
నీవు నొప్పికొన్న నీతి గలట్టి స్త్రీ
జాతి యొప్పికొనునె? జగము నగదె? ౬౩

చ. విను మిది యెట్టిదన్న నొకవేళను బత్రము కాలదోష మం
దిన నధికారి "యీఋణము తీరినయట్టిదె!" యంచుఁ దీర్చుఁగా
కన్నృణి ఋణార్తుఁడౌనె? మఱి యర్థత కల్గునె? వాని కెందు; నే
జనుఁ దలపాపిమోముఁ గను శాస్త్రము వాని భరింప నేమగున్,

తే. గీ. కోటిధర్మశాస్త్రమ్ములు గుంపుగూడి
జగము నాఁగఁగ నేరవు శాస్త్రసమ్మ

తంబయేనియు జనవిరుద్ధంబయేని
త్యాజ్యమే యని పల్కిరి ధర్మవిదులు. ౬౫

క. మానమ్ముకన్న నేదియు,
మానవతికి హెచ్చు గాదు మగఁ డొక్కఁడే
మానవతి కొండు మగనికిఁ
బ్రాణేశ్వరియైన దానిబ్రతు కొకబ్రతుకే ? ౬౬

ఉ. నీకడ ధర్మపన్నములు నే వచియించుట తప్పు కాక పో
దీకుమతిన్ క్షమించి హృదయేశ్వరుఁ బాము ననుగ్రహించి నా
శోకముఁ బాపి నాకు నయి శోకిలు బంధుల నత్తమామలన్
నీకరుణాకటాక్షములు నించి యశోకులఁ జేయు మీశ్వరా. ౬౭

ఉ. పాములకన్న నగ్గలపు బాముల కగ్గముఁ జేయు భర్తలన్
దామములట్లు శీర్షములఁ దాల్చెడి భారతజాతి నుద్భవం
బై మగనాలి "పా" మనుచుఁ బ్రాణవిభున్ విడి మాన మన్యథా
గా మొరవోఁ జరింప నలకామిని కుండునె ? పుట్ట సద్గతుల్. ౬౮

చ. "సతి" యనుపేరునన్ మొదట శంకర ! నీ సతివై మెలంగి పా
ర్వతిగ జనించె దక్షునిసవంబున మేను ద్యజించి; యప్పుడున్
బతిగ నిన్నున్ వరించెను దపం బొనరించి; యెఱుంగవే ? పతి
వ్రతలచరిత్రలో యభవ ? పార్వతి భారతజాతినాతియే. ౬౯

చ. బ్రతికెడి కాల మెంత ? అలుపంబుగదా ? మఱియందులోఁ గడున్
మితమగు జవ్వనాన "శ్రుతి మించినరాగమునన్" బడఁగ నే
సతి మతి గొల్పు ? శాస్త్రమున సమ్మతి యుండిన నుండుఁగాక దే
వతలు సహింతుర్గాక పతి భామిని కొక్కఁడె యెట్టిఁ డేనియున్.

క. "అన్యో విధీయతే" యను
మాన్యులవచనములు మాఱుమనువుల కెరయకా

ధన్యాలకుఁదక్కఁ దదితర
కన్యకలకు విషసమములు గనుము మహేశా. ౭౧

తే. గీ. నిగ్రహానుగ్రహములకు నీకు మించు
దక్షు లిం కెక్కడను లేరు దైవతముల
ననుట కలమన్మథుఁడె సాక్షి యతనిముందుఁ
జంపి బ్రతికించితివి భార్యజాలిఁ జూచి. ౭౨

శా. ఆయుర్దాయము లేని వానిసుతు దీర్ఘాయుష్కుఁ గాఁ జేయు ని
న్నే యాచించెద భర్తబాముసకున్నై నీ కెంత యీమార్చు త్వ
న్మాయాకల్పిత మీ జగత్తు కృపతో మన్నించి మద్భర్త కీ
కాయంపుం గుబుసంబు డుల్చి మనుజాకారంబు గై సేయవే?" ౭౩

వ. ఇట్లనేకవిధంబులం బ్రార్థించి యన్నపూర్ణాలయంబున కరిగి పేటిక
నాయంబిక కట్టెదుట దించి కేల్మోడ్చి. ౭౪

శ్లో. దృష్టిం మ య్యభిషించ దేవి సరయం కల్పప్రసూనోపమాం
పుష్ట్యానందకరీం వరాభయకరీం సంపత్కరీం సత్కరీమ్
యత్పాతా దగమ చ్ఛివ స్స జగతాం భిక్షాటకోఽ పీశతాం
కాశీనాథమనోహరే గురుకృపాపూర్ణేఽ న్నపూర్ణేంబికే. ౭౫

వ. అని మఱియును. ౭౬

మ. జననీ! నీదగుశక్తికల్మినె జగత్సంసారచక్రమ్ము సాఁ
గును నీతత్త్వ మెఱుంగలేరుగద? తక్కన్వేల్పు లట్లుండ న
వ్వనజాతాసనమాధవాభవులు; నీ వవ్వారి నొక్కప్డు స్త్రీ
లనుగాఁ జేసి చమత్కరించితివి వాలాయమ్ము లజ్జింపఁగన్. ౭౭

క. మగవారైన త్రిమూర్తుల
మగువలుగా మార్చు నీదుమహిమకు నొకగో

ప్పగఁ ద్రోఁపదు పాముసు మను
జుఁగ జేయుట నీకు నివిగొ? జోహార్లంబా? ౭౮

చ. ఎవనికి నేది దుస్తరమొ? యాశుఁ డెఱింగియె అట్టి యాపదగ్
దవులఁగఁ జేయు వానికి; యథార్థ మిదే పృథివీశుపుత్రి భూ
ధవునకుఁ గోడలైన నను దాఁకిన దెట్టి విపత్తొ? చూడుమీ
శివ! ఫణి మానిసిన్ సలుప శ్రీయది యెంతయొయుండి యేమగున్

సీ. ఉత్తరాసుతుఁ బరీక్షిత్తు శ్రీకృష్ణుండు
బ్రదికించె నస్త్రంపుబాధ యుడిపి
యెన్నఁడో చచ్చిన యెల్లకౌరవులఁ జూ
పించె వ్యాసుఁడు బంధువితతి కెలమిఁ
బదియాఱునేఁడుల పాయంబు బ్రహ్మాక
ల్పములుగాఁ జేసె నీపాణవిభుఁడు
కల విట్టి వెన్నిదుష్కరకార్యములొ మహా
మహులు సాధించిన విహామునందు

తే. గీ. వశముగాని విపత్తు పైఁబడినయపుడు
దైవతారాధనం బొందు దక్క శరణ
ముండ దని తల్లి! నిను వేఁడుచుంటి నాఁడు
దాన నీ వాఁడుదానవు తగదె? ప్రోవ. ౮౦

ఉ. భర్తకు నీవు మున్నడిన పాట్లు పురాణము లయ్యె నీకు స
త్కీర్తి ఘటించు నామగనికిన్ మనుజత్వ మొసంగి నాకు ని
య్యార్తిఁ దొలంచదేని; యిది యన్యులకున్ వశమా నె? నీవొ నీ
భర్తయొ? కల్లఁజేసికొని పాతక మియ్యది పాపఁగా వలెన్. ౮౧

వ. ఇట్లనేకప్రకారమ్ముల నాత్రిలోకసుందరి యాత్రిపురసుందరిం బ్రార్థించి పదంపడి పంచకోశంబునం గలత్తదంగదేవతలదర్శించి వేడికొని యచ్చోటు వీడి దక్షిణాభిముఖంబుగ బయలువెడలి శ్రీజగ

న్నాథ శ్రీకూర్మ సింహాచలాన్నవరదాద్రిక్షారామ కోటిఫలికోటి లింగ భద్రాచల విజయవాటికా తిరుత్తని క్షేత్రంబులు సేవించి కొనుచుఁ గాళహస్తీశ్వరు సందర్శించికొని శ్రీ తిరుపతివేంకటేశ్వరు కొండ కరిగి యలమేలుమంగాధినాథు దేవళమ్మున కరిగి యా శ్రీనివాసుం బ్రార్థించి మఱియును. ౮౨

తే. గీ. శేషశైలేశుఁడవు నీవు శేషురూపు
గలుగు ప్రాణి కిల్లాలనై కస్తి గుడుచు
చున్నదానను నేను నీ వొకఁడు దక్కఁ
బిలిచినంత నో యనువేల్పు లిలను లేరు. ౮౩

ఉ. పామును గట్టిపెట్టితివి భర్తగ నాకు మహాత్మ! తొల్లి యే
బాముని నిందుకై సలుపు పాతక మెట్టిది? దాని కిప్పు డే
నేమి యొనర్తు నిష్కృతికి; నీవె యనుజ్ఞ యొసంగవేని నా
బా మెటు తెల్లవాఱెడిఁ గృపామయ! శ్రీమహిళామనోహరా.

తే. గీ. ఎట్టి యిక్కట్టులేని నీగట్టు మెట్టు
నంతఁ దీరుట వింటి నాదెట్టికర్మ
మొకొ? నీగట్టు నెక్కియే యుంటిఁగాని
గట్టు కెక్కిన యట్లుగాఁ గానఁబడదు. ౮౫

ఉ. ఎందుకు సృష్టి సేయవలె నీననుఁ; జేసితి కాక కాశ్యపీ
ణ్ణందిని జేయనేల! ఫణినాథునియాలిగఁ జేయనేల, యే
మందును లేని యీామయ మమర్పఁగ నేల మహాత్మ! యేగతిఁ
మందునో? నీవ తెల్పవలె మామకదుర్దశ యెట్లు డిందునో? ౮౬

వ. ఇట్లనేకవిధంబులఁ బ్రార్థించి యటనుండి కాంచీక్షేత్రమ్మునకుం జని. ౮౭

శా. ఏకామేశ్వరురాణి వేడ్కొని కాంచీశు న్నతుల్ సేసి ది
వ్యాకారుఁ మధురాపురీవిభుఁ దదర్ధాంగిఁ బ్రేమాభిల్లి పై
నాకావేరికి మధ్యసీమ ఫణిమంచాభ్యంతరస్థుఁ మహా
ప్రాకారుఁ గమలాసమేతు నల శ్రీరంగేశు నర్చించియుఁ. ౬౮

వ. అయ్యెడ భర్తృపాదసేవాపరాయణురాలగు రంగేశ్వరి నుద్దేశించి.

మ. ఫణిరాట్ఛయ్యఁ బరున్న భర్త కెలమిఁ బాదమ్ము లొత్తంగ నీ
వణుమాత్రమ్మును శంక నొంద విది నా కాశ్చర్య మే. భర్త యా
ఫణి నంటఁ వణఁకందుదు న్నిను భజింప న్వచ్చితిం దల్లి! నా
వణఁ కెట్టుల్ సురుఁగుఁ వచించి కరుణఁ వర్షింపు మోయాశ్వరీ.

మ. ఫణి కే నర్ధశరీరమై పతిని సంభావింపఁగా నేరఁ ద
త్ఫణిరాట్ఛయ్యఁ బరుండు వీ వహహ? నీ భాగ్యంబు, సాధ్వీశిరో
మణి వన్నఁ మటి నీవకా కొరులె? నీ మాహాత్మ్య మగ్గింతు నా
వణఁకు న్బాపి యనుగ్రహింపుము సరస్వత్పుత్రికారత్నమా! ౯౧

మ. నను బాముం బొనరించి ప్రోతు ననినఁ సంతోషమే భర్తకుఁ
“మనుజత్వమ్ము నొసంగి ప్రోతు” ననినఁ సంతోషమే దీనికిఁ
బని లే దంబరొ? నీదుభర్త నడుగఁ బ్రహ్మాండమా? నీకు ని
ప్పని; లోకావనకర్తభార్యవుగదా! పద్మాలయావాసినీ. ౯౨

ఉ. సత్త్వగుణప్రధాన వయి సర్వజగంబులు ప్రోచు దేవుఁ డ
త్తత్త్వమయుండు విష్ణునెడఁదఁ వసియింతువు సర్వదా జగ
త్తత్త్వము నీ వెఱుంగుదు వధన్యను నఁ గరుణించి నాథున
ర్మత్త్వముఁ బాపు మంబరొ? ప్రపంచవిరుద్ధపుధర్మ ముండునే? ౯౩

శా. పాతివ్రత్య మనంగ నెట్టిదియొ? నీభావ మ్మెఱుంగుఁ బ్రపం
చాతీతం బది లేని స్త్రీబ్రతు కసహ్యం బావ్రత మ్మొకట్ఁ చే

నాతిన్ ధన్య నొనర్చు నం చితరు లెన్నంగాఁ బనే లే దను
న్న్యాతం బయ్యది భారతావనికి నిచ్చో శంక లేదంబరో! ౯౪

శా. సీతాదేవి యటన్న నెట్టిఘనులుం జేమోడ్చు లర్పింతు ప్రవి
ఖ్యాతంబుల్ పను లేమి చేసినది యక్కాంతాశిరోరత్న మీ
పాతివ్రత్యపు సువ్రతం బొకటియే ప్రఖ్యాతికి న్మూలమై
భీతిన్ వహ్నికిఁ గూర్చెఁ జల్లఁబడి యాపె న్మన్కి జోహార్లిడెన్.

చ. కలరు పతివ్రతామణులు కాంతలలో మఱియెందఱేని; వా
రలకుఁ బ్రసిద్ధి కాల మది రాక ప్రసిద్ధి ఘటింప; దేరికిన్
గలుగునొ? తత్ప్రసక్తి, అది ఖ్యాతిని పైటికిఁ దెచ్చు నట్టికాం
త లుభయలోకముల్ గెలిచి ధన్యతఁ గాంచెద రొక్కదీనిచే. ౯౬

శా. నాకుం బూర్తిగఁ దత్ప్రసక్తి కలిగె న్నాశీలమున్ జక్కఁగా
లోకుల్ గన్గొన నిట్టివ్యాజ మొకఁ డాలోచించి నీవో? మఱి
న్నీకాంతుండొ? సుతుండొ? "కూర్చి" రనుచు న్నె నెంతు లేకున్నచో
నాకుం బాముసు బెండ్లి చేసెదరె? అన్యాయంబుగాఁ దల్లిరో! ౯౭

వ. ఇట్లు పెక్కుభంగుల వినుతించి యనంతరం బలసాధ్వీమణి "రొట్టెకు
రేవేమి" యను లోకోక్తికి స్మారకంబుగా నెన్నియో తీర్థమ్ములు
పౌనరుక్త్యప్రసక్తిగాని పౌర్వాపర్యప్రసక్తి గాని లేని చందంబున
సేవించె నందుం గొన్నిటిమాత్ర మిట వక్కాణింతు. ౯౮

శా. శ్రీశైలేశు భజించె మంగళగిరి శ్రీవాసు సేవించె రా
మేశున్ మ్రొక్కెను జంబుకేశ్వరు హరున్ వీక్షించె శ్రీమత్కపా
లేశున్ సాఁగిలి వేఁడె నయ్యతివ యిట్లే దక్షిణాశామరు
ద్దేశంబుల్ చని కాంచి మ్రొక్కి తనయుద్దేశంబు గట్టెక్కమిన్. ౯౯

క. చింతించుచుఁ గాంతార
ప్రాంతమ్ములు వట్టి పోవుపట్టున నొకచో

నంతర్వాణులు కొందఱు
పొంతం గనుపట్టి రల్లపుణ్యస్త్రీకిన్. ౧౦౦

వ. వారిం గన్గొన్నమాత్రన యప్పతివ్రతాతిలకంబు శిరోగతంబగు పేటికన్ దింపికొని సాష్టాంగంబుగ మ్రొక్కుటయు నమ్మహానీయులు మనఃపూర్వకముగా నాపె నాశీర్వచించిరి. ౧౦౧

తే. గీ. వారి దీవనలందున వాంఛితార్థ
సిద్ధి వినవచ్చినంత నచ్చెలువమిన్న
యలరి వారలపదముల కెలమి మరల
మ్రొక్కి యిట్లనె నాత్మలో ముదము పొదల. ౧౦౨

ఉ. మీరు మహానుభావులరు మీకు సమస్త మెఱుంగవచ్చునో
ధారుణిదేవులార! వితథంబగు దీవన మీరు సేయరో
ధీరులు! మీరు సత్కవులు తెల్లము మీవచనంపుసొంపు నా
కీరహిఁ దెల్పె నాదగు మనీషితముల్ వినుఁ డుత్తమోత్తముల్.

వ. అని యప్పేటికం గేల నిర్దేశించి చూపి. ౧౦౪

క. ఇందున్నపాము మానిసి
యందము గొనవలయు నిదియె యస్మదభీష్టం
బెందఱినో సేవించితి
బృందారకుల; నది యెల్ల వితథమై పోయెన్. ౧౦౫

క. గత్యంతరంబుఁ గానక
యిత్యర్థజ్ఞాన మేది యే నున్నతఱిన్
బ్రత్యక్షం బైతిరి మీ
రత్యర్థయథార్థవచను లనఘులు సుకవుల్. ౧౦౬

క. మీవాక్కులమోఘమ్ములు
గావలయున్ గానిచో నిగమములుఁ బొల్లై

పోవలయు న్నాకోరిక
మీావలనం దీరవలె నమేయులు మీారల్. ౧౦౭

క. ఘనులు మహాత్ములు మీానో
ట నన్నృత మెన్నఁటికి వెలువడదు పొరఁబాటుం
గనికూడ "విప్రివాక్యే
జనార్దన" యటన్న నుడి యసత్యం బగు నే? ౧౦౮

సీ. నామమాత్రి బ్రాహ్మణ వచనమ్ములు వ్యర్థ
మగుఁగాని మీా వంటి నిగమవిదులు
బ్రహ్మవిజ్ఞానులు పరమతపోధనుల్
పలికెడిపలుకులఁ గలుగునర్థ
మెన్నఁడు బీఱువో దిటఁ దోఁచు సూర్యుఁ డ
చ్చటఁ దోఁచుఁగాక యోసదయులార?
నాయొనరించుపుణ్యపుఁ దీర్థయాత్రిల
ఫలమెల్ల మీాస్వరూపమ్ముదాల్చి

తే. గీ. యెదుటఁ బ్రిత్యక్షమైనట్టు లెదకుఁ దట్టు
చుండె మీాయిచ్చునాశీస్సు నింకుమనము
తోడ నిల్పికొనుండు నా గోడు వాపి
బ్రాహ్మణోత్తములార ! సుప్రిథితులార ! ౧౦౯

క. నావాంఛితార్థమును మీా
తో విన్నప మాచరింపుదు నదే పెట్టైన
నావిభుఁ డహి ధర్మాంగద
భూవిభుసుతుఁ డుండె వినుఁడు పూర్వోత్కరంబుల్. ౧౧౦

వ. అని చెప్పిన మాటయె మరల మరలఁ జెప్పుచు నతిదీనమ్ముగా
వేడికొనుచుఁ బదంబులంబడి లేవకున్న యప్పరమపతివ్రత వృత్తాం

తం బెల్ల నాంతరంగికదృష్టి నెఱింగి భావిశుభంబుగూడఁ దెలిసికొని
యభయం బిచ్చుచు నమ్మహానీయు లిట్లనిరి. ౧౧౧

క. నినుఁ గని ధన్యుల మైతిమి
వనితల నీవంటి సత్ప్రివర్తన గలమా
నినులు మునులె కాదు జనా
ర్దనముఖదేవతలకుఁ సదా గణనీయల్. ౧౧౨

శా. పాతివ్రత్యపుఁ బారమార్థికదశన్ వ్యాఖ్యానముల్ జేయఁగా
నోతల్లీ!జనియించి యుంటి "మును లేరో?" యంచుఁ బ్రశ్నించుచో
సీతాదేవి మొదల్ సతీమణు లిలన్ జెన్నారి రవ్వారిపై
చేతింగా నినుఁ జెప్పి తీరవలె నోశీతాంశుబింబాననా? ౧౧౩

ఉ. "పా" మనుశబ్దముల్ వినినభామ లటుండఁగఁ బూరుషుల్ గదుల్
భీ మది గ్రిమ్మ సొమ్మసిలి వెన్కడుగేయుదు రీవు పాముతో
బాములు గుద్చుచుంటివి నృపాలకుమారిక వయ్యు; నక్కజం
బౌ మహిళామణీ! నృపతి కాత్మజ వీవు నరేంద్రపుత్త్రివే? ౧౧౪

వ. నావుడు నమ్మహానీయుల కాసాధ్వీమణి యిట్లను. ౧౧౫

ఉ. పా మనుపేరె గాని పగఁ బట్టు టెఱుంగదు నుంత నన్నుఁ గా
నీ మఱి యొల్లఁగాని యొక యించుకయున్ భయపెట్టినట్లు లే
దేమఱి పెట్టె ముట్టినను; నీదృశజన్మ మదేల వచ్చెనో?
యేమనుజుండు సత్త్వగుణ మింతటి దబ్బి చరింపఁ డో మునుల్.

వ. ఇట్లు పతిసుగుణంబులు కొండంతలు చేసి వ్యాకరించు నాసాధ్విని
మెచ్చికొనుచు నాదయానసముద్రు లిట్లనిరి. ౧౧౭

ఉ. ఎందుల కింకఁ జింతిలెద వెంతయొకాలము పట్టదింక నో
సుందరి? నీకు దాపుననె సూచిత మయ్యెడి మంచికాల; మా

చందనగంధి! నీమగఁడు చంద్రజయంతవసంతకంతులన్
జిందఁగ నాడు నందమునఁ జెన్నెసలారు నృపాత్మజుండగున్.

చ. ఎవరికిఁగాని పూర్వజని యిప్పటికష్టసుఖాలకున్ గతం
బవు నది భుక్తివల్లనె లయంబగు శేషము స్వల్పమే యిఁకన్
మివిలె సుఖానుభూతితటి మీకుఁ గనున్దరి కేగుదెంచె నీ
దువిభునిపాత్రచరిత్ర మది తొయ్యలి! చెప్పెద మాలకింపుమా!.

వ॥ ఈతండు పూర్వజన్మంబున నఖండవదాన్యుండును దయాళుండును ధర్మనిరతుండును నగు నొక మహారాజునకు నపత్యంబై పుట్టి తండ్రియనంతరమ్మున రాజ్యంబునకు వచ్చి యుక్తాయుక్తవివేకశూన్యుండై యపాత్రుల నమాత్యులుగా నియోగించి వారల దురుపదేశంబులకుఁ జెవియొగ్గి తండ్రియు నంతకుఁ బూర్వులును నొసంగిన యగ్రహారాదిధర్మకార్యమ్ములు వమ్మొనర్ప మొదలిడెను. ౧_౨౦

శా. పన్నుల్లేశము లేని పండితుల "దుంబాలా యినాం" భూమికిన్
బన్నుల్ హెచ్చుగఁ గట్టి వారలఁ గడున్ బాధింపఁగాఁ జొచ్చె న
ప్ప న్నీఁజాలక వారు తద్ధరణిరాట్పాల్యప్రదేశంబునం
దున్నం జిక్కని వీడి పోయి రెటకో యుల్లంబు శోకిల్లఁగన్.

ఉ. అన్నికులాలవారలకు నాదరువేదియొ వృత్తి యుండి సం
పన్నతఁ బూర్వ బ్రాహ్మణులు మాత్రము జ్ఞాన మొసంగు విద్యనే
మన్ననఁ జేసి యేపనిని మాని చరించుట తేఁకుచూచి బల్
పున్నె మటంచు వారలకు భూముల నిచ్చి తరించి రెందఱో.

శా. ఛందస్సుల్ మఱియున్ దదంగములు సచ్ఛాత్రుల్ పఠింపం జిదా
నందుల్ వేత్తలు తద్రహస్యములు విన్నాణమ్ముమైఁ జెప్పనా

యందమ్ముం గని "వీరు సోమరు" లటం చాటేఁడు భావించి వా
రిం దండించెఁ గరంబువ్యాజమున దారిద్ర్యంబు తోరంబుగన్.

సీ. పన్నియ నేరని పండితో త్తముల వీఁ
పున రాతిగుండ్లను మోపువారు
ఇంటిలో నున్నట్టి యి త్తడిపాత్రల
వీధులలోఁ బడవేయువారు
అంతకు రిక్తులై నట్టి గేస్తుల తల్పు
ద్వారబంధము లూడ్చి వైచువారు
పుస్తెపూసల నమ్మి శిస్తు గట్టఁగ నేగ
నది చాల దింకఁ దెమ్మనెడివారు

తే. గీ. నగుచు రాజకీయోద్యోగు లధిపుఁ బట్టి
లంచగొండులై లేశము మంచిచెడ్డ
లరయ కూరక బాధింప నచోటు విడిచి
తరలి పోయిరి పీడకుఁ దాళలేక. ౧౨౪

క. సుకృతార్థులు తనపూర్వు లు
పకృతిన్ బొనరించి పిల్చి పాఱుల నిల్పన్
వికృతికి లోనై యీతఁ డ
పకృతిన్ గావించి తుదకుఁ బాపై పుట్టెన్. ౧౨౫

ఉ. అప్పుడుఁగూడ నీవె సతివై తి పురాకృతపుణ్యరేఖచే
నిప్పృథివీశపుత్రిన కనీదృశమైన పతివ్రతాత్వపుం
జొప్పున నేఁడు నీయనకె సూత్రము దాల్చిన దాన వైతి వే
త ప్పితఁ డాచరించినను ద్వత్సుకృతాన సురింగె వేల్మిడిన్. ౧౨౬

వ. భవత్పాతివ్రత్య సాహాయ్యమే లేకయున్న నింతట నంతట నీతం
డొనరించిన దుష్కృతం బుపశమింపఁజేసెడిది కాదని వెండియు, ౧౨౭

తే. గీ. ఆవగింజంత మిగిలె నయ్యదియు స్వల్ప
కాలమునఁ దీఱుఁ బడమటి కంధిదరిని
బ్రహ్మగుండమ్మునందు నీజిహ్మగత్వ
మెడలు నిశ్చయ మరుగు మయ్యెడకుఁ బడఁతి. ౧౨౮

తే. గీ. ఆత్మహత్య యొనర్చు నుద్యమము నీకుఁ
గలిగియుండియుఁ బతిమీఁది కరుణకతన
సాహసింప లేకుంటివి సాధ్వి ? సకల
మే మెఱింగితి మిఁక నట్టి దేల ? నీకు. ౧౨౯

చ. ఇల నలనాకలోకమున నింక మఱొక్కట నెందుఁగాని నీ
తుల నిలువం బడం గలుగు తొయ్యలి లేదను కీర్తితోఁ బతిం
గొలుచుచు సంతతిం బడసి కోర్కులపారము మెట్టు వాసరం
బులు దరి యన్యో నీసలుపు పుణ్య మగణ్య మెఱుంగు కోమలీ !

శా. శ్రీవాణీగిరిజాశచీసతులు నీశీలమ్ము నాలించి ని
న్నే వేళ స్మృతియింతు రీవలెనె ఆయీ సువ్రతం బూనఁగా
భావంబందు యతింతు రీవ సుఖి? యీపాతివ్రతీసువ్రతం
బేవారూనిన వారికొజ్జవు నిజం బేణాక్షి ? యీ మా నుడుల్. ౧౩౧

తే. గీ. బ్రాహ్మణావమానమ్మునఁ బడఁతి మున్ను
నహుషుఁ డహి యయ్యె స్వర్గాధినాథుఁడయ్యు
నింక నితరుల లెక్కేమి? యీతఁడన్లె
అహి యయి తరించె నీదుపుణ్యమునఁ జేసి. ౧౩౨

వ. సందియం బందకుము, సర్వంబు భద్రింబయ్యెడి నాపద లెప్పటికిని
గాపురం బొనర్చవు, సంపత్కాలంబు సమీపం బయ్యె. ౧౩౩

చ. అని వచియించి వారు చని రంబుజలోచన బ్రహ్మగుండముం
మనమున నెంచికొంచు నొకమాసములో నటకేగి ధానఁ ధా

మునిఁగి పవిత్రయై పిదప ముంచెను పేటికతోడ నాథునిన్
గనుఁగవ చేరెఁడై మరలఁ గన్గొనె మూఁత దొలంచి పేటికన్. ౧౩౪

క. చెప్పఁగరాని కుతూహల,
ముప్పతిలఁగ మూఁత దెఱచి యువిద గనంగా
నెప్పటి "బుసబుస"లే మఱి
యెప్పటిపామే మృగాక్షి కెదుటన్ దోఁచెన్. ౧౩౫

క. అంతకు మును గల్గిన యా
సంతోషమ్మునకుఁ బై విచారమునకు నా
యింతి సరిపెట్టికొనె నీ
దొంతర సర్వత్ర యిట్లె తోఁచెడి ననుచున్. ౧౩౬

ఉ. పాఱులు "మోసగించి" రని భావమునం దలపోయు, నిందులో
"వారికి నేమి లాభ" మని వారిజలోచన శంక నొందు "దు
ర్వారము కర్మబంధ మది పాయునె? యింతటిమాత్ర" నంచు రం
భోరువు సారెఁ జింతపడు నూరక యశ్రులు చిందువందఁగన్. ౧౩౭

చ. తిరిగితిఁ దీర్థరాజములు దేవతల న్మది నమ్మి; గ్రావముల్
గరఁగ నుతించితిన్ దెలియఁగా వినిపించితి నాయవస్థ; నొ
క్కరుఁ బ్రతివల్కరేమిటి కిఁకన్ బ్రదుకన్వలెనన్న! భర్త కె
వ్వరు గతి నేను వీడునెడఁ 'బా' మని చంపుదు రొక్కపెట్టునన్.

వ. అని నిట్టూర్పు నించి కొండొక యోజించి. ౧౩౯

శా. ఎందుం బాములు లేవె? నన్ను బలెనే యెవ్వార లవ్వాని నె
త్తిం దాల్పన్ బ్రదుకన్ సారంగములయందే కాదె? తద్వాస; మే
నిందున్ వీడుదు వామలూరువివరం బేదేని శోధించి; యా
నందంబందుచు నందుఁ దా బ్రదుకు మన్నాథుండు వేయేఁడులున్.

వ. అని వెండియుఁ గొండొక తిలకించి. ౧౪౧

ఉ. పామగుఁగాక మద్విభుఁడు పార్థివపత్నితనూజుఁ జౌటచే
నేమనుజన్ముఁడుం గనని యెల్లమహాసదుపాయముల్ సుశ
య్యామృదుళాన్నపానముల కాజననం బలవాటు పడ్డ యీ
స్వామి యెటుల్ భుజించునొకో? చప్పనికప్పల నొండె నెల్కలన్.

క. తినియో? తినకో? నేఁ దిరి
గిన తీర్థములందుఁ బా లొగిన్ సంపాదిం
చి నివేదించితి నిట విడి
చిన నీయన కెట్లు దొరకు క్షీరము లకటా! ౧౪౩

ఆ. వె. కొట్టి చంపనెంచు నట్టివారే కాని
క్షీరముల నొసంగువా రటంచుఁ
గలరె? సర్పములకు నిల సుబ్బరాయని
షష్ఠిఁ దక్క నాగుచవితిఁ దక్క. ౧౪౪

క. ఏఁటికి రెండుదినమ్ములు
గాటముగా భుక్తి దొరకుఁగా కదియు నిరా
ఘాట మనరాదు పాముల
చోటులయందెల్లఁ బోయు సుదతులు గలరే? ౧౪౫

ఉ. ఏమెయిఁ జూచిన న్మరణమే శరణం బని యెంచికొన్న నా
కీ మహిపాలసూతి యెటు లిచ్చు ననుజ్ఞ; నెటుల్ దెగింతు? నే
నేమని యొప్పగింతు మృతి? కెవ్వరి కొప్పఁగఁ జెప్పినన్ గటా
పాముకుఁ బాలు వోసెడి కృపామయు లంచు జగాన నుందురే.

వ. అని మనమ్మున నేమేమియో తలంచికొని. ౧౪౬

సీ. పాదమ్ములొత్తు నామోద ముండిననేమి?
గూఢపాత్తునకుఁ జేకూరు టెట్లు
మోము మోమునఁ జేర్చు మోహ ముండిననేమి?
ప్రాణంబుపైఁ దీపి వాయలేదు

ప్రక్కలోఁ బన్నుండు భావ ముండిన నేమి ?
పెట్టెలో నా మేను పట్టు బెట్లు
హాస్యోక్తు లాడు నాహ్లాద ముండిన నేమి ?
"కస్సుబుస్సులకు" భీ గాంచవలసె
తే. గీ. పనికి మాలిన మానుషీభావ మెంత
హానికర మయ్యె వచ్చుజన్మాననేని
పాముగాఁ బుట్టి నీసేవ పడయుదాన
నిన్ను మానిసిగాఁ జేయ నేర నింక. ౧౭౮

వ. అని మఱియు నేమో యోజించి నాథా? ని న్నిట డించి నేను మేను
ద్యజింతునేని. ౧౭౯

తే. గీ. "ఈనఁ గాచి నక్కలపాలుగా నొనర్చె"
నన్న లోకోక్తి కగ్గమైనట్టు లయ్యె
"బ్రహ్మాగుండంబునందు సర్వత్వ మెడలు"
నన్నఋషివాక్యములు వ్యర్థ మగు టిదేమొ ? ౧౮౦

వ. అని మరలఁ దల్లిదండ్రులం దలంచికొని. ౧౮౧

శా. యావద్రాజశిరస్థలస్థసుకుటానర్ఘ ప్రభాస్వన్మణి
శ్రీవిస్మేరపదారవిందనృపనారీగర్భవాసమ్మునన్
దావాగ్నిన్ బలెఁ బుట్టు వందితిని మాతాపితృఘాంకూరస
ద్భావంబో!కత మిట్టివంతలకు; మత్ప్రారబ్ధమో? అన్యమో!౧౮౨

క. స్నానం బొనర్చుపట్టున
నేనియమంబేని లోప మొనసెనొ? యేమో?
మానీంద్రు లనృతవాక్కులు
గా నగుదురె? యెన్నఁడేని కత మిది యేమో. ౧౮౩

క. అని మరల మరల స్నానం
బును బొనరించి పతిని స్నానమును జేయించున్
జననాథపుత్త్రి ఫలితం
బును గానక చూచు మింటిమొగమై వగమై. ౧౫౪

వ. ఇట్లసకృదావృత్తిగా స్నానంబులం బొనర్చియుఁ బ్రయోజనంబు గానక మరణంబునఁ గృతనిశ్చయయై. ౧౫౫

క. పతి యున్న పెట్టెదెఱచి వి
నతయై తాఁ ద్రిఃప్రదక్షిణముగాఁ బతికి
న్నతిఁ జేసి గద్గదస్వన
మతిమాత్రముగాఁగ నిట్టు లను సాంజలియై. ౧౫౬

శా. నాథా? నే దురదృష్టురాల ద్విజవర్గస్వామములందున్ దయాం
భోధుల్ వల్కుట వ్యర్థమానె? నిజమా పుణ్యమ్మె నాకున్నఁ; ద
త్సాధుల్ గూడ మదర్థమందున వృథాజల్పాకులై రింక నా
రాధింపన్ మఱి లేవు తీర్థములు సర్వంబున్ సమాప్తిన్ గనెన్.

ఉ. పుట్టితి వీవు భోగి వయి భోగము లెన్నియొ గల్గు తల్లికిన్
వట్టి దరిద్రదేవతను భార్యగఁ జేకొనఁబట్టి నేఁ డిటుల్
నట్టడవిన్ దరువ్రజమునన్ దిగు లొందుట సంభవించెఁ జే
పట్టకు మింక నేజనిని భార్యగ నిట్టి యభాగ్యదేవతన్. ౧౫౭

శా. ప్రాణంబుల్ ప్రియ మెల్లజీవులకు; నేఁ బ్రాణంబు గోల్పోవుచున్
బ్రాణేశు న్నిను నాజ్ఞ వేడెదను నీయాజ్ఞ న్వినా వీడుచోఁ
బ్రాణం; బయ్యెడఁగూడ నాకు నరకం బౌ గమ్య; మేమందు వో
ప్రాణేశా? సెలవిచ్చి యేగు మదిగో? వల్మీక మం దుండఁగన్.

ఉ. నీ వట కేగు నా పిదప నే మఱి నే నసువుల్ త్యజింతు నా
భావము నీ వెఱుంగుదువు బాములు నీకొఱ కన్ని యెన్నియొ.

దేవుని నమ్మి సైఁచితిని దేవుఁడు లేఁడొ? యొకంట నుండియు
న్నావలనన్ గృపం గనఁడొ? నా విధి కాతఁడు కర్త యెట్లగున్?

వ. అని స్మృతి నభినయించి యిట్లను నాథా! భావిజన్మమ్మున నన్ను
భార్యగాఁ జేకొనవల దని ము న్ననియుంటి నామాట యున్మత్తా
లాపమువంటి దగుటచేఁ బాటింపకుము, దీని నాలింపుము. ౧౬౧

చ. మఱియొకజన్మమం దయిన మానిసి పుట్టువు నీవు పుట్టి; నన్
బరిణయ మాడఁగోరెదను బ్రాప్తి యటుల్ ఘటియింపదేని నే
నురగినిగా జనించి నిను నొంది తరించెద జన్మజన్మముల్
వరుఁ డొకఁడే పతివ్రతకు, వారవధూటులు గారుగా సతుల్. ౧౬౨

(పా) వారవధూటులె? సత్కులాంగనల్.

క. ఇటు లా రాజకుమారిక
యెటు మదికిం బాలుపోక హృదయేశుని పీ
డుట కొప్పక పీడకపో
వుటవలన ఫలంబు లేక పొగులుచు నుండెన్. ౧౬౩

ఉ. అక్కట! యీపె ఘోరదశ ఆరయు టెట్లని యేమొ? వారుణీ
దిక్కుధరమ్ముచాటునకు దేవశిఖామణి సూర్యుఁ డేగె న
ల్దిక్కులు శూన్యమై యలసతీమణి నెమ్మదిపోల్కి నుండె నే
రిక్కలొ? యక్కడక్కడఁ బరీక్షగఁ జూచినఁ గొన్ని గన్పడెన్. ౧౬౪

తే. గీ. బ్రహ్మగుండంబుదరి సంధ్య వార్చికొనఁగ
వచ్చినట్టి విప్రులు శిష్యవర్గములును
జనిరి తమపొందుపట్లకు; జనవరేణ్యు
పుత్రి సుందరి గుండంపుఁబొంత నుండె. ౧౬౫

## ఆ శీ ర్వ చ న ము

క. కలరెందఱో ధీమంతులు
గలరు ప్రయోజకులు నిలను గమ్మెలకుల స
త్ఫలమగు శేఖరుఁ బోలరు
కలుగుంగా కిత్తని కీర్తి నఖండయశంబుల్. ౧౬౬

గ ద్య

ఇది శ్రీ తిరుపతి వేంకటీయం బగు పతివ్రత యను ప్రబంధమ్మునందుఁ
దృ తీ యా శ్వా స ము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ మత్పరదేవతాయై నమః.

# పతివ్రత

## తిరుపతి వేంకటీయము

### చతుర్థాశ్వాసము

వ. అనంతర మయ్యుపన్యాసకుండు సదస్యులం గూర్చి యిట్లుపన్యసింపం దొడంగె. సోదర సోదరీమణులారా! వినుండు, పదంపడి చీకటి ప్రాకటముగ వ్యాపించె నంతట నాసాధ్వీవతంసంబు హతాశురాలై దానంబడి ప్రాణత్యాగంబు నొనర్చు పూన్కిలోఁ బరికరంబు బంధించుకొని. ౧

ఉ. ఏను నరేంద్రుపుత్రిక నరేంద్రుని భార్య నరేంద్రుగోడలన్
గానె? సరీసృపంబనినఁ గంప మిదేటి కటంచు నేమొ? యు
మ్మానిని పెట్టె నున్న యలమానవనాథతనూజు నక్కానం
బూని తటాలునం జనియెఁ బుట్టసొరంగమునందు వీడఁగన్. ౨

క. బ్రతుకునెడ నాశగల య
ప్డతివకుఁ బాముని మది భయంపడె నిపుడో?
మృతిఁ గోరుచుండె "మరణే
సతి కిం భయ" మన్ననుడి సుసంగతమయ్యెన్. ౩

ఆ. వె. భోగిఁ గౌఁగిలించు భోగినియున్ బలె
నిర్భయముగ నా ఫణిని గుచద్వ
యంబు సోఁక నక్కునంబట్టి చరచరఁ
బుట్టదరికి నేగెఁ బూవుఁబోఁడి. ౪

ఉ. కంపము గల్గె, భీకతనఁ గాదది; మై గగు రంకురించె నా
చంపకగంధికిన్; జలివశంబునఁ గాదది; భర్తమేనితో
నింపుగ మేను చేర్చుటయె యింతకు హేతువు; చంచలాక్షి డెం
దంపువిశుద్ధి సర్వము నిదంకృతియే వివరించు వ్యాఖ్యయై. ౫

క. పతి యెట్టిఁడైనఁ గుతుకా
న్వితలై సేవించునట్టి వెలఁదులు గల రీ
యతివపతి విషపుఁ బురువఁట!
యతనుజనక మగునఁ టతనియాశ్లేష మహో. ౬

ఉ. అందము లేనివాఁడయిన నామయపీడితుఁడైన వృద్ధతా
స్పందితుఁడైన మూర్ఖయినఁ జంచలచిత్తుఁడె యైన జాతికిఁ
జెందినజీవిపై మనసుఁ జేర్చు పతివ్రత లుండుఁగాక యే
సుందరి పాముపై వలపుఁ జూపెడి? హాలహాలంపుముద్దపై. ౭

క. ఋభునాథు లిది "నభూతో
న భవిష్యతి" యంచు ముక్కునన్ వ్రేలిడి బల్
రభసమునఁ జూచుచుండఁగ
నిభగామిని కౌఁగిలించె నెలమిఁ బాముఁ. ౮

సీ. పుట్టసారంగాసఁ బెట్ట నెట్టన నెంచు
నెంచి కన్నుల నీరు నించి మాను
మాని మానిని దీనమానసయై కుందుఁ
గుంది ధైర్యము దెచ్చికొని తలంచుఁ
దలఁచి "నేనే పోవుతటి నాకు నితరచిం
త లివేల" యంచు నమ్మలిక నెనయు
నెనసి సుఖమ్ముగా నింట నుండిననాథు
నేల? తెచ్చితి నంచుఁ జాల వనరు

తే. గీ. వనరుహానన యిటు పలువగలఁ బొగులుఁ
గాని "యిద మిత్థ" మనుత్రోవఁ గాంచదయ్యె
నట్టిదురవస్థ నున్న యయ్యబల కెడమ
కన్నదరె భావిశుభసూచకంబు గాఁగ. ౯

కం. తనదురవస్థకు నది "లం
ఘనాల మనుగుడుపురీతి"గా నెంచుచుఁ బు
ట్టను వీడి భోగిరాజును;
మనమున యోజింపఁ దొడఁగె మానిని మరలన్. ౧౦

చ. మును లపుడన్న వాక్యము లమోఘము లయ్యెను మోఘమై చనెన్
మనమున దానికై వగవ మంచికి సూచకమౌచు వామలో
చన మదరన్ దొడంగె నిది శాస్త్రవిరుద్ధము నేను జీవితం
బును విడఁబోవునప్డు శుభముల్ ఘటియించుట యేరికో కదా? ౧౧

కం. ఏగెడి పరలోకమ్మునఁ
గాఁ గూడదె? యేదొ శుభము; జ్ఞాను లిహంబున్
బా గనరు కష్టపడి స్వ
ర్భోగానకె యత్న మెల్లపుడు జేతు రిటన్. ౧౨

ఉ. స్నానములం బొనర్చితిని జాహ్నవి నన్యసరిత్తులన్; హరి
ధ్యాన మొనర్చుచుంటిఁ బతి దైవముగాఁ గనుచుంటి నిట్టి నా
పై నెన రేల? యల్ల భగవంతున కుండదు సర్వథా పర
స్థానమునందుఁ గల్గు శుభసంగతి కక్షి యిటుల్ స్ఫురించెడిన్. ౧౩

శా. అంతేకాని యిహమ్మునం గలుగు మే లావంతయు న్నాకు లే
దింతే నిక్కువ మేను భర్తయెడఁ ద ప్పేమాత్రమున్ జేయ ని
క్కాంతారస్థలి నొంటి డించి చను టొక్కండే కదన్ దప్పు మ
త్స్వాంత మ్మిందుల కొప్ప దైనను భవిష్యత్సత్త శోచ్యంబయా. ౧౪

ఉ. ఉండి ప్రయోజనంబు లవ ముండని నాయటువంటి బోటి యిం
మంపుటకన్న మండుటయె యుక్తముగాఁ గనుపట్టు నంచు నా
యండజయాన గుండమునయందు దిగంబడఁ బోవునప్పు డొ
క్కండు వినంబడె న్నుడి ప్రకాశముగా నిటు లాకసమ్మునన్. ౧౫

కం. అనఘాత్మరాల! నీ భ
ర్తను గంఠమునందుఁ బుష్పదామముబలె నో
య్యనఁ దాల్చి యిందు స్నానం
బొనరించిన నీదుకోర్కె యొగి ఫలియించున్. ౧౬

చ. అను నుడి యవ్వెలంది విని యన్ని దెసల్ పరికించి "యెవ్వ రా
డినదియుఁ గాద యిద్ది ప్రకటించిన దంబరవాణి నిక్క" మం
చనుకొని వేగఁ బుట్టకడ కంబుజలోచన యేగి కాంచె భ
ర్తను నిజశీర్ష రత్నరుచిరాజివిరాజితవామలూరునిన్. ౧౭

క. కని కనుల నద్దికొని య
ల్లన రెండుప్రోమార్త మాలలాగునఁ గంఠం
బునఁ దాల్చి తానమాడన్
జనుదెంచెన్ మడుగుదరికిఁ జంద్రుఁడు వొడిచెన్. ౧౮

వ. అట్లు చనుదెంచి స్నానంబొనర్పఁ బోవుచు. ౧౯

తే. గీ. మానవత్త్వంబు గలిగిన మగువనేని
మానవత్త్వంబు గనుఁగాక మద్విభుండు
కలుగుఁగాక పాతివ్రతి కలఘుగార
వమ్మనుచు స్నానమాడె నప్పడఁతిమిన్న. ౨౦

ఉ. అంతకుమున్న చంద్రునుదయంబును దారసమాటఁ జేసి య
య్యంతికిఁ బ్రాణనాథుమొగ మీక్షణపర్వముగాఁగఁ దోఁచె న
య్యంతి ప్రతస్థ యయ్యెఁ బరమేశ్వరుచెద్దుని మాంసఖాణ్డ్రియె
కాంతునికిం గనంబడియెఁ గల్కికి సిగ్గుదయించె మోమునన్. ౨౧

ఆ. వె. అప్పు డాపె పొందు నానందమును గవుల్
వ్రాయలేరు చిత్రఫలకమందుఁ
జిత్రకారులేని చిత్రింపఁగా నేర
రభినయించుటకును నలవి గాదు. ౨౨

క. తడివస్త్రములు విడిచి వెం
బడిఁ బొడివస్త్రములు దాలుపఁగ సిద్ధముగాఁ
బడియుండె మడత లట దే
వుఁడు తలఁచిన లోప మొకటఁ బొడసూపెడినే. ౨౩

క. తడి యూఁటిచి వెంబడినే
పొడివస్త్రమ్ములను దాల్చి పొలఁతియుఁ బ్రాణే
శుఁడు రతియు మన్మథుఁడు నాఁ
గడు నింపుగ నొకరి నొకరు గన్గొని రెలమిన్. ౨౪

వ. తత్సమయమ్మున నయోమయమ్మును గొండొక జ్ఞానసంపన్నము
గూడ నగుచిత్తమ్ముతో నక్కజంపడుచు నతం డాపెం గని. ౨౫

చ. ఎవ తెవునీవు? నే నెవఁడ? నిన్నిసి నిక్కడ నుంట కెక్కతం?
బవనిపుత్రివో? పొలఁతి? యామరివో? మఱి నీచరిత్రమున్
శ్రవణసుఖమ్ముగా వినఁగఁ జాలఁ గుతూహల ముప్పతిల్లె నిం
తవఱకు నెక్కడుంటివొకో? తల్లియుఁ దండ్రి మగండు నెవ్వరో?

శా. నన్నుం గూరిచికూడ నీ వెఱుఁగుచో నాళీకపత్రాక్షి? చె
ప్ప న్నిన్ గోరెదఁ దల్లిదండ్రు లెవ రేవంశమ్మునం బుట్టినాఁ
డ? నే నిక్కడనుండి యెం దరుగువాఁడ? నీ్నదుపే రేమియో?
నిన్న న్నే నెటనుంటి? నీవెఱుఁగుదే? నీ కేమి నే నౌదునో?

క. మడుఁగు నీ్నవును మఱియు
య్యడవియు నాకసముఁ జంద్రు డలరిక్కలుఁ గ

న్పడియెడి నన్యము లేది
కక్కడ నేటికి నుంటి మబల? కడుఁ జోద్య మగుఁ. ౨౮

మ. కలయో? దైవతమాయయో ? యితరమో ? కానంగరాకుండె నీ
వలనం దేలవలెఁ యథార్థ; మిచటఁ బంధు ల్మఱెవ్వారు లే
రెలమి న్ని న్గనునక్కలంది మది నేమేమో ?. తలంపుల్ హాళా
హాళిఁ గావించెడిఁ గారణంబు చెపుమీ ? యబ్జాతపత్రేక్షణా. ౨౯

వ. ఇట్లు గ్రుచ్చిగ్రుచ్చి సారెసారెకుఁ బ్రశ్నించు రాజకుమారుని నర్మ
గర్భంబుగా నార్యపుత్రా! యని సంబోధించి పాణిగ్రహణం
బొనర్చి మున్ను దిగవిడిచినపెట్టె యున్న పుట్టదరికిఁ దీసికొని చని
యా రాజేంద్రనందన యిట్లు వక్కాణింపం దొడంగె. ౩౦

సీ. ముందు నీదు చరిత్రమును విన్ము ప్రాణేశ !
అర్మిలి తల్లి ధర్మాంగదుండు
నీతండ్రి నీవుండు నెల వల్ల పెట్టెయే
కాశ్మీర దేశానఁ గలదు మీర
లేలెడిపట్టణ; మిలకు భూషణ మనఁ
జను దానినామంబు కనకపురము
నీతల్లిదండ్రులు నిర్మలాచారులు
నిన్నుఁ గాంచిరి వ్రతా లెన్నొ చేసి
తే. గీ. ఏను నీధర్మపత్ని న న్నెఱుఁగ వీవు
తల్లిదండ్రుల నెఱుఁగవు దైవవశత
నట్టి ప్రతిబంధ మేర్పడె నదియు నల్ల
బ్రహ్మగుండమ్ము దీర్చె నోపార్థివేంద్ర. ౩౧

వ. ఇట్లు సూత్రప్రాయమ్ముగా నొడువు నుడువు లాలించి యప్పురుష
పుంగవుం డక్కజంపడుచు నక్కలికి కిట్లను. ౩౨

క. నీ వెది వచియించిన నది
యే వేదం; బల్పమైనయీ పేటిక నా
కేవిధమున నెలవయ్యెను?
భావింపఁగ దాన నేను బట్టుట యెట్టుల్. 33

వ. సంశయచ్ఛేదంబుగ వివరింపు మనవుడు రాజపుత్రి రాజపుత్రా! దానిన్గుఱించి చెప్పఁబూనినచో నింతట నంతటఁ దేలునదికాదు చెప్పుదమన్నను నయ్యది లోకమ్ముతోడిపాటిది కాకుంటచే నీవు విశ్వసింపవు. క్రమమ్ముగా సకలము నీకే తెలియ వచ్చెడి నవుడు రా కొమరుం డాపె కిట్లను. 34

ఆ. వె. ఈ వసత్య మీఁద వే నెఱుంగుదు నాదు
సందియమ్ముఁ దీర్పు చానమిన్న!
ఏదొ! నాదుమదికి నించుక గోచరిం
చినటులుండి మఱపు చెందు మరల. 35

వ. నావుడు నవ్వెలంది యిట్లు చెప్పం దొడంగె. 36

శా. భూమీభారము మోయురాజునకెటుల్ పుట్టున్ దదన్యుండు; త
ద్భూమీభారము మోయు శేషుఁడె యెటో పుట్టన్వలెన్ సర్వథా
నా మీఁయమ్మకుఁ బుట్టి తీవనఘ! యీనామాట నీమానసం
బేమాడ్కిన్ గ్రహియించు? నందుకెకదా? యీమాట నేడాఁచితిన్.

ఉ॥ "పామును గాంచె రాజ్ఞి" యనఁ "బౌరులు గేలి యొనర్తు"రంచు స
ద్ధీమహితుండు మంత్రి యటు తెల్పక డాఁచి "కుమారుఁ గాంచె రా
జ్ఞీమణి" యంచుఁ బౌరులకుఁ జెప్పి వివాహముకూడఁ జేసె నే
బూమెలొ? పన్ని నన్ను; నిది పూర్వపు నీచరితంబు భూవరా?. 37

క. మాతండ్రి కేరళేశ్వరుఁ
డీతత్త్వము దెలియ కిచ్చె నీననుఁ గత్తిన్

చేతఁగొని కులాచార
మ్మూన్మితముగాఁ బెండ్లి చేసి రొగిఁ గపటమునన్. ౩౯

క. పదిరెండేండ్లవయస్సున
నిది జరిగెను గొంతకాల మీకాపట్యం
బిదమిత్థ మనుచుఁ దెలియద
పదపడి విస్పష్టముగఁ గపట మిది తెలిసెన్. ౪౦

చ. తెలిసినమీఁద నిన్నుఁగొని తీర్థములెల్లఁ జరించుచుండఁగా
నలఘులు బ్రాహ్మణప్రవరు లస్మదదృష్టమునన్ లభించి వా
రలు వచియించి భావిగతి; బ్రహ్మసమాఖ్య నెసంగు గుండమున్
దెలిపిరి "నీకు మానవత దీన లభించు" నటంచుఁ బేర్మితో. ౪౧

ఉ. వారియనుజ్ఞ నిచ్చటికి వచ్చితి నిన్ గొని బ్రహ్మగుండపున్
వారి మునింగినంతటనె వచ్చెను మానిసిరూపు నీకు; నీ
వారికి నచ్చఁ జెప్ప భగవంతుఁడు తోడ్పడు మీఁదఁ బెండ్లి య
వ్వారిగ వారు సేయవలె వాస్తవముం గనిపెట్టి నెట్టనన్. ౪౨

చ. నృపసుతుఁ డింతయు న్వినుచు నెమ్మది సంశయడోల నూఁగఁగాఁ
గపటపుఁబెండ్లి లోనయిన గాథ యథార్థమ యౌనొ? లేక యీ
చపలమృగాక్షి కల్పనయొ? చాన నృపాలతనూజ యూరకే
కృపణత కగ్గమై యిటు చరించునె? యిట్టిదుచున్ బికారియై. ౪౩

వ. అని మనమ్మునఁ గొండొక విశ్వసించి యాసాధ్విం గాంచి యిటుపై
మనకుఁ గర్తవ్యం బెయ్యదియో వచింపుము!. నావుడు నమ్మహిళా
మణి యిట్లను. ౪౪

ఉ. ఇంతకుఁ దెచ్చినట్టి పరమేశ్వరుఁ డెంతకుఁ దేఁడు దైవమున్
స్వాంతమునందు నమ్మి చెడువారును నమ్మక బాగుపడ్డ ధీ

మంతులు నుండెఱ్ఱ? పొఱ్ఱద్దుటను మార్గము గన్గొని జన్మదేశపుం
బుంతను బట్టి పోవుదము భూపలలామ ? విచారమేటికిక్. ౪౫

ఉ. ఎండమొగ మ్మెఱుంగని మహీపతిపుత్త్రికనయ్యు సర్వభూ
మండలముఁ జరించితిని మార్గము లెన్నియొ మెట్టి చూచితిన్
గొండల నెక్కితిన్ గుహలు గోపురముల్ పురముల్ సమస్త మె
క్కండననేల! నా కెఱుఁగఁగాఁబడె నాథ? భవన్నిమిత్తమై. ౪౬

వ. ఇట్లిరువురు నా బ్రహ్మగుండంబుదరి నున్న యొక వటవృక్షంబు
దాపున లోకబాంధవు నుదయంబుఁ బ్రతీక్షించుచు గతచరిత్రంబు
ప్రసంగించుకొనుచు భవిష్యత్కృత్యంబున కుపాయమ్ము నాలో
చించుచున్నంత. ౪౭

చ. నృపసుత భర్తతోడ నెపు డిల్వెడి వచ్చెఁ దదాది మంత్రి దా
గపటపుభిక్షువై యతివఁ గంటికి ఱెప్పవిధానఁ గాచికొం
చెపు డెట కేగు నక్కడికి నేగుచు సర్వ మెఱుంగుచుండె నీ
పె పడినకష్టికన్న నలపెగ్గడకష్టి శతాంశ మెక్కుడౌ. ౪౮

తే. గీ. ఆపె కృతకృత్య యగుటకు నాపె గాంచు
సంతసముకన్న నిబ్బడి సంతసమ్ము
గాంచి య్యాదంపతుల యున్నకడకు వచ్చి
పట్టరానిముదమ్మున నిట్టు లనియె. ౪౯

శా. అమ్మా! నీపడునెల్లయాతనకు నే నైతింజుమీ? హేతు; వే
కొమ్మల్ నీసరిగారు సాధ్వులను బేరొ్కన్ నిన్ను ముఁ జెప్పియే
సుమ్మా! వేఱొకసాధ్విఁ జెప్పవలె నన్ జూడంగఁ బో వెప్పు డో
యమ్మాయీ! సచివుండ నీపతికి నే నౌదున్ గటాక్షింపుమా! ౫౦

ఉ. నీదగు జాతకమ్మును మనీషులు గన్గొని నీచరిత్ర మ
ర్యాదను బూసగుచ్చినటు లంతయుఁ జెప్పఁగ విశ్వసించి దా

మోదరసపాదచిహ్నితునియుగ్మలిగా నిను సల్పినాఁడఁ గా
శోదర మయ్యె మానిసి యహో! త్వదుదార సతీత్వసంపదన్. ౫౧

కం. ఏసావిత్రియు మఱి యిం
కే సీతాదేవి మఱియు నింకేయనసూ
యాసతియు నీకు నెనయే?
నీసాటి వచించుపట్ల నీ వాక్కె తెవే! ౫౨

వ. ఇట్లనేక ప్రకారమ్ముల నామె నభినందించి రాకొమరు జననాది వృత్తంబు సర్వంబు సవిస్తరమ్ముగా నాయన కెఱింగించి యారేయి వారితోఁ గడపి వెండియు. ౫౩

మ. అదిగోఁ దూఱుపు తెల్లవాఱె నుదయంబౌ వేగుఁజుక్కంక నే
గెద నే నీదరినున్న పోలికి నృపాంగీకారముం బొంది తే
రిదె వేగం గొని తెత్తు నందనుక మీ రిందే సుఖం బుండుఁ డం
చుదయంబౌసరి కేగె మంత్రి తగ నయ్యుర్వీశు దర్శింపఁగన్. ౫౪

వ. అట్లేగి దర్శించి తన వచ్చినకార్యంబును దనచరిత్రంబును నొడువు టయు నమ్మహీమండలాధినాథుండు వాయువేగ మనోవేగంబు లతోఁ బోఁగల వాజులం బూన్చిన రథంబిచ్చి పంపుఁ డని తగువారి నియోగించుటయకాక యప్పుణ్యదంపతులకు నూతనవస్త్రంబులను భోజనభాజనాదిసదుపాయంబులుగూడ సమకూర్పవలసినదనియు నానతిచ్చి గౌరవించె. ౫౫

ఆ. వె. పొలఁతి వ్రతసమాప్తి పొందెడిదనక భో
జనము సేయ ఫలమొ? జలమొ దక్క
నని వచించెఁ బిదప నయ్యమాత్యుఁడు తెచ్చి
నట్టి రథము నెక్కి రాలుమగలు. ౫౬

వ॥ రథారోహణం బొనర్చినపిమ్మట నాసచివుం డల సాధ్వి నుపలక్షించి
యిట్లనియె. ౫౭

ఉ. ముక్కుకు సూటిగా భువనమున్ జరియించితి వీవు "రొట్టె కెం
దక్కఱ లేదు రే" వనినయట్టులు; నీదగు పుట్టినింటిప్రో
లిక్కడికిన్ సమీపముననే కల దమ్మరో! ముందుగా రథ
మ్మక్కడి కేగ నిచ్చెద ననంతరమం దెటు వీలో? అట్లగున్. ౫౮

వ. నావుడు రాజపుత్రి యిట్లనియె. ౫౯

ఆ. వె. అత్తవారి యూరి కరిగి యాయమ్మకుఁ
గొమరుఁ జూపి మ్రొక్కి కోర్కె మనము
నిండి సందడించుచుండె నట్లయ్యును
బుట్టినిల్ సమీపమునకు వచ్చి. ౬౦

ఆ. వె. అచటి కేగకుంట యవ్యర్థంబుగాఁ దోఁప
దదియుఁగాక యీజనాధినాథుఁ
డొసఁగు తేరితోడ నొక్కపెట్టున నేగ
జాల మదియు నిటకుఁ జాల దవ్వు. ౬౧

క. ఎక్కడి కాశ్మీరం బది
యిక్కడనిక్కడనె గలదె? హిమవత్కుధరం
బెక్కడ? నీలగిరీంద్రం
బెక్కడ? యెన్నాళ్ళో పట్టు నేగుట కటకటా. ౬౨

వ. అని సమ్మతించుటయు సచివుండు మాణిక్యపురఘంటాపథమ్మునఁ
దేరువోనిమ్మని సారథికిం జెప్పె నతం డట్ల కావించె నింక నక్కడ.

చ. కొమిరె యవస్థ సర్వమును గుంభినిభర్తకు నాఁడునాఁటఁ గ
ర్ణములను జొచ్చి యెంతటిపరాభవ మెంతటిద్రోహ మెంతమో

సము ? మఱి యెంతవింత మనుజన్ముఁ డెవండునుగూడఁ బుత్రి స
ర్పమునకుఁ గట్టిపెట్టఁడఁట ? పార్థివుఁ డిచ్చు టదెట్టి యాంధ్యమో?

మ. అరరే ! యెంతటి మాయలాఁడు సచివుం; డప్పార్థివుం డెంత ట
క్కరి; యాతేనికళత్రి మాఁడుదగునో ? కాదో? కదా! హంత! సో
మరి నాకన్న జగాన నొండొకఁడు సమ్రాడ్వర్గమం దుండఁ డె
వ్వారు విన్న న్నను నవ్వి గాని యొరు నవ్వం బో రిల న్నెవ్వగ౯.

తే. గీ. అచలుఁ డగుఁగాక హిమవంతుఁ డాత్మజాత
నహి కొసంగఁ డహులఁ దాల్చు నయ్యె కొసఁగె
నదియె విడ్డూరముగ జగ మాడికొనెడి
నహి కొసంగిన న న్నెట్టు లాడిపోయు ! ౬౬

తే. గీ. చారచక్షుష్కతకు నపకార మింత
చాల దనుకొందుఁ గూఁతు నొసంగుపట్ల
నెంతయో చూడవలె ననియెడిని ధర్మ
శాస్త్రములు; సర్వ మెఱిఁగిన జడుఁడ నేను. ౬౭

మ. "వరునిం జూచితి" మంచుఁ జెప్పిరి ద్విజస్వాముల్; వరు న్వెఱిఁగొ
క్కరు సింగారము చేసి చూపి "రసియే కళ్యాణపుం బట్టునం
దరు దెంచున్ గొమరుండు రాఁ" డనిరి నా కడ్డైని సందేహ మం
కుర మందన్వలె నంకురింప దేది యొక్కొ? కారణం బక్కటా! ౬౮

వ. అని కొండొక విచారించి యయ్యది వారికులాచారం బనుటచే స్థూలదృష్టి నందులకు సమ్మతింపవలసి వచ్చుటయె యింతముప్పునకు మూలం బయ్యెనని వెండియు. ౬౯

ఉ. పుట్టె నెటో విషాహి యలభూపతియాలికిఁ బూర్వకర్మము౯
బట్టె; పురమ్మువారలకుఁ "బట్టియె పుట్టె" నటంచు నమ్మికల్
పుట్టె నసత్య మాఁటయుఁ బోలునుగా కవమాన ముంటచేఁ
బుట్టకు నప్పఁ జెప్ప కిటు పోలునె? నాసుత కంటుఁ గట్టుటల్. ౭౦

వ. అట్లు గాదేని. ౭౧

ఉ. ఆలయ మొండు గట్టి యహి నందుఁ దగన్ బదిలమ్ముఁ జేసి మేల్
పూలను బత్తిరిన్ దినముఁ బూజ లొనర్పఁగ నర్చకాళి న
య్యాలయమందు నిల్పి తగినంతధనం బలవారి కిచ్చుటల్
పోలునుగాక మత్స్యతకుఁ బోలునె? పుస్తెను గట్టు మోసముల్. ౭౨

చ. ఎవఁడని నన్ దలంచె గుణహీనుఁడు పాముకు గన్న మేటి; భూ
ధవుఁడ టె? శుద్ధనీచుఁ డెట ధాత్రిఁ గనంబడఁ డిట్టిఁ డేపురా
ణవరములందు నెందును వినంబడ దీదృశగాథ; మోసగాం
డ్రివనిఁ గలారుగాని యిది యద్భుత మింతటి మోస ముంటునే?

తే. గీ. ఎంత విషపుచ్ఛమును గాఁడ యేని తేఁడు
కనునె? విషకీటమును వేఱొకండు; చెప్ప
నేల? యీకాన్పె తద్గుణంబెల్లఁ దెల్పె
విత్తనమ్మునుబట్టియే వృక్షముండు. ౭౪

క. మోసంబొనర్చుటకు నడి
యాస మెదేనుండవలయు నదియును లేదే!
కాసంతయు నిప్పట్ల
న్నానుతకున్ గస్తి యది వినా యోజింపన్. ౭౫

చ. ఒరు లొనరించు తప్పిదము లోర్పుమెయిన్ దిలకించి శాస్త్రముల్
పొరిఁబొరిఁ జర్చ చేసి తగుపోణిమి శిక్ష విధించుతేండ్ల కే
దురితపు బుద్ధి పుట్టిన నెదుర్కొని యెవ్వఁడు మందలించు? భూ
వరుఁడు సమర్థుఁ డింకొకఁడు వానికి శిక్ష యొనర్చు టొప్పగున్.

వ. అని రత్నాంగదన రేందుగ్రిండు కోపోద్రేకంబున మండిపడుచు
నమాత్యులన్ బిలిచి కనకపురంబుమీఁదికి దండు నడిపించుటకు

సేనానుల కాజ్ఞ యొసఁగుం డని యానతిచ్చి హెచ్చిన విచారమ్ము
నం గుందుచున్న రాజ్ఞి నోదార్చి యిట్లనియె. ౭౭

ఆ. వె. పాముపెట్టె నెత్తిపైఁ బెట్టుకొని కూఁతు
రెల్లతీర్థయాత్ర లేగుచున్న
యట్లు వినియు మండలాధిపత్యము గల్గి
యుండికూడ నూరకుండఁ దగునె? ౭౮

ఉ. పాముఁట? యల్లుఁ; డిట్టిపని భామరొ? రాజ్యమదాంధబుద్ధి నే
నేమఱి చేతుఁగాక యది యీవెటు లొప్పితి క త్తి నంపు లే
లా? మరియాద లిట్టి వెటనైనను వింటిమె? యంచు దేవి! న
న్నామెయి మందలింపవలదా? కలదా? యిల దారుణం బిటుల్.

క. అగుఁగాక కొమిరె వెంటనె
నగుఁబా టిది తెల్పనేని నందనకుం బొం
దుగఁ బెండ్లి మరలఁ జేయనె?
నిగమము లొప్పికొను నిది యనింద్య మ్మగుటన్. ౮౦

మ. ఇపు డారాజును శిక్ష సేయుటకునై యే నేగుచున్నాఁడ యు
ద్ధపు సన్నాహ ముపక్రమించితిని దీర్ఘంబుల్ విలోకించు నే
రుపు చెన్నారెడి పాఱులన్ గొమరితన్ రోయంగ నంపింతు న
య్యపకారి న్నృపుఁ ద్రుంతు నూరడుము దైవాయత్తముల్ మానునే?

ఉ. ఏగతి డాఁగునంచు మది నెంచెనొ? యీకపటంబు మంత్రి దూ
రాగతియోజనల్ విడి దురాగతముల్ పొనరించుమంత్రులన్
భోగపరాయణుల్ నృపులు పూన్చుట ముప్పగుఁ గార్యభార; మే
లాగున నీ పరాభవకళంకము నీఁగుదు వానిఁ జంపమిన్. ౮౧

మ. నృపుఁడే దోషి మఱింతదోషి సచివుం; డీయిర్వురన్ యుద్ధమం
దుపరోధించి శిరమ్ము లూడ్చుటవినా యొండొక్కఁ డేమాత్ర మీ

కపటంపుంగ్రియకుం బ్రతిక్రియ కనంగారాదు పాతివ్రతీ
శపథంబూనినకూఁతు రోయుట కిదే సద్విప్రులన్ బంపెదన్. ౮౩

వ. అని చెప్పి పుత్రమిత్రామాత్య పురస్సరమ్ముగా రత్నాంగదుండు
దండు వెడలెడివార్త వేగులవలన నెఱింగి. ౮౪

ఉ. దాఁగునె? యెంతడాఁచిన వృథా యొనరించిన మోస మెట్టులో
లేఁగెఁ గొమార్తయే యరిగి తేనికిఁ జెప్పెనొ? చెప్ప దెవ్వరే
నీగతి చెప్పియుందురు సరే? దరికిన్ జనుదెంచెఁ బోరు; దూ
రాగతిఁ గాంచనట్టి పను లన్నియు నిట్టివె యే రొనర్చినన్. ౮౫

క. ఏ మొగము వెట్టికొని యీ
భూమీశునితోడ ననికిఁ బోవుదుఁ దప్పు
న్నామీఁదఁ బెట్టుకొని సి
గ్గా మొగ మేలాగు నెత్తనా రణభూమిన్. ౮౬

వ. అని కొండొక విచారించి. ౮౭

ఉ. ఎవ్వఁడు గోరెఁ బామనక "యింపగు బిడ్డఁడె పుట్టె నెంతయో
మవ్వము గల్గువాఁ" డనుచు మాటికి వీటను జాట బంప; నీ
చివ్వకుఁగాక యెల్లరు "నిసీ" యను నీ పరిణీతి యేల? నన్
బువ్వఁగఁ దిట్టరే? ప్రజలు భూపులు ని ష్ఠనికిం గడంగినన్. ౮౮

చ. ననుఁ గని "మోసగాఁడ" వనినన్ బ్రతి యే మన నేర్తు? నే నెఱుం
గ ననిన నమ్మువా రెవరు? కాపటికంపు దురాగతం బొన
ర్చినసచివున్ నివారణము సేయని దోసము నాది కాదె? మం
తనమున కాతఁడేనియుఁ గనంబడఁ డియ్యది యేమి చిత్రమో?

శా. ధారాళంపుఁ బ్రవర్తన న్విడిచి దుర్ధార్ష్ట్యప్రధానంబుగా
నే రేకార్య మొనర్చినం దుదకుఁ దా నీరీతి కే వచ్చు ని

స్సారం బాపని; మోస మీయిహపరస్వారస్యశూన్యంబు సం
సారుల్ "మోసము దోస" మం చెఱిఁగియుఁ జాలించిరో రక్కటా.

ఉ. "నాకును సైన్య మున్న" దని నాపయికిఁ జనుదెంచు భూపతిఁ
డీకొని పోరికిఁ జనుదునే నది యెవ్వఁడు మెచ్చు? నెంత త
ప్పో కనుపట్టుచుండెఁ దలపోసిన నాయెడ; జాతకార్థముల్
వాకొనునాఁటి పండితులు వత్తురె? యిత్తఱి సంధి సేయఁగన్.

వ. ధర్మాంగదుం డిట్లు విచారించుచు యుద్ధవైముఖ్యంబ శరణ్యంబనియు "యతో ధర్మ స్తతో జయ" యనియుఁ బశుబలమ్మునం జేసి తాను జయించుపక్షమ్మునం గూడ నైతికవిజయం బతనిదే యగుటం జేసి లోకమ్ము త న్నాదరింపదనియు లోకాదరపాత్రంబు గాని జన్మంబు వ్యర్థంబనియుఁ దలంచి రత్నాంగదున కిట్లు వార్త నంపించె. ౯౨

ఉ. నీయెడ నే నొనర్చిన దనీదృశమైన దోసంగు; పాము క
న్యాయముగా భవత్తనుజ నా సచివుం డెదొ మాయ పన్నుచున్
జాయగ సంగ్రహించుటకు సమ్మతిఁ జూపుట కీవు సైఁతుకా
కీయపరాధమున్ సయిచునే? భగవంతుఁ డధర్మ మాఁగఁడే? ౯౩

క. అక్కటతన యుద్ధమునకై
నిక్కము నే మొగియఁ దప్పు నే సల్పితి నీ
దిక్కున; దీనికి నిష్కృతి
యొక్కడఁ గనుపట్ట దొక్క ఋజువర్తనమే. ౯౪

వ. ధర్మాంగదుం డిట్లు ఋజుమార్గం బవలంబించి తనదోసంగునుండి విముక్తుండుగా నుంకించుచుండె నింక నక్కడ రత్నాంగదునకు నిట్లు స్వప్నము వచ్చె.

క. నీ కొమిరెయు నీ యల్లుఁడు
నీ కోటకు వచ్చుచుండ నీ వెంధు కయో!

లోకము గర్హింపంగ స
మీకమునకు నేనఁ గూర్చి యేగెద వకటా! ౯౬

ఉ. పాముకుఁ బెండ్లి చేసితివి బంగరువంటి కొమార్త నీవు బల్
సోమరి వల్లునిం గనక "చూచితి మం" చితరుల్ వచింప; నీ
యేమఱుపాటునన్ దొడరె నెంత యనర్థమొ! దాని సర్వమున్
గోమలి దీర్చె సర్పమునకున్ మనుజత్వము నేకరించుచున్. ౯౭

తే. గీ. త్వరగ వియ్యంకునకు క్షమాపణము చెప్పి
యతనితోఁగూడ నీకోట కరిగి పేర్మిఁ
గూఁతు నల్లున కిచ్చి సంకోచ మెడలి
పెండ్లిచేయుము తడవేల? పృథ్వినాథ. ౯౮

వ. ఇట్లొకవృద్ధవిప్రుండు వచించినట్లె మేలు కాంచి దెసలు పరికించుసంత.

చ. అదె తెలవాఱుచుండె భవదాగమనంబు నెఱింగి యెల్లకో
విదులును స్నానసంధ్యలకు వే చనుచుండిరి యాపగాతటుల్
త్వదుదయ మెల్లలోకులును దద్దయుఁ గోరుచునుండి "శేగుదె
మ్మద నిది"యంచుఁ దెల్పుగతి నార్వఁదొడంగె ఖగంబు లెల్లెడన్.

వ. పదంపడి స్నానసంధ్యాదులు నిర్వర్తించుకొని రత్నాంగదుండు వేకువం బొడసూపిన స్వప్న మ్మాశ్చర్యులకు నెఱిఁగించుచుండ ధర్మాంగదుం డంపిన రాయబారి వచ్చి లేఖ నొసంగె దానిం జదివికొని.

చ. "వలవదు యుద్ధ"మంచుఁ గల వచ్చి ద్విజోత్తముఁ డట్లుచెప్పె నీ
వల నలవీరకాఁడు తనపైఁ గలదోసము నొప్పికొంచుఁ దాఁ
గలనికి సమ్మతింపని ప్రకారమునన్ లిఖియించె నేదియో
కలదు నిమిత్త మిందుల; క కారణ మీద్వయి కైక్య మబ్బునే? ౧౦౨

క. పాము మనుష్యుం డగుటకుఁ
బామరులే నమ్మనపుడు ప్రాజ్ఞుల కెట్టుల్

గా మది నమ్మిక కల్గెడి
భూమిని మునులేని విపుడు ఫుట్టెఁ బ్రోత్తల్. ౧౦౩

క. మును పశ్విను లతివృద్ధుఁ జ్య
వను యౌవనవంతు నాత్మవైద్యమున నొన
ర్చినకత వినఁబడుఁ బామఁ
మనుజుగ నవ్వారలేని మార్పంగలరే? ౧౦౪

తే. గీ. "గంపచిక్కు"గ నుండె నిక్కత యథార్థ
మరయు నెట్లొకో? యంచు రత్నాంగదుండు
యోజన యొనర్చుచుండ నయ్యోడయని కగు
పడిరి కూఁతు రల్లుఁడు సచివప్రవరుఁడు. ౧౦౫

వ. నమస్కరించి యెదుట నిలువం బడిన వారి ముహ్వుర నవలోకించి రత్నాంగదుం డత్యాశ్చర్యపర్యాప్తుండై యిది నిజమే యగుఁగాక యిక్కత యెట్లు విశ్వసనీయం బగు? నే నితని నల్లునిగా నెట్లు విశ్వసింతు? వియ్యంకుఁడు ధర్మాంగదుఁడేని యితని నాత్మజుఁగా నెట్లంగీకరించు నని పరిపరివిధములం దలపోయుచున్నంత సచివుండు సకలమ్మమ్మహారాజునకు విన్నవించెఁ బదంపడి రత్నాంగదుం డిది యింతమాత్రమ్మున లోకులకు విశ్వాసపాత్రంబు గాదని తలంచి వెంబడిన ధర్మాంగదున కాహ్వాన మంపించి తాను ససైన్యంబుగాఁ బుత్రికాజామాతృ సచివులతో రాజధానికరిగె, ననంతరంబు ధర్మాంగదుండును జనుదెంచెఁ ద్రిలోకసుందరియు భర్తయు నాయనకు నమస్కరించినయనంతరము ధర్మాంగదుండు రత్నాంగదునకిట్లనియె.

చ. మొదట వచించె నీసకలముం 'దుద కిట్లగు' నంచు మంత్రి 'కో
విదు లెవరో వచించి'రని; విశ్వసనీయముగాకయున్న నే
నది మది విశ్వసించితి 'మహాత్ము లసత్యములాడ'రంచు; నేఁ
డిది యితరుల్ యథార్థ మని యెంతురె? లోకులు కాకు లక్కటా!

తే. గీ. ఈపె నాకోడలే సంశయింపవలసి
లే దతండు కొమారుఁడే నాదు హృదయ
మొప్పికొనుచున్నయది లోక మొప్పికొనుట
కింతమాత్రము చాలదు హెచ్చువలయు. ౧౦౮

ఉ. ఈమె పతివ్రతాతిలక మేకపటమ్మును జేసియుండ దీ
ధీమతి, మంత్రి యీపె చనుతీర్థములెల్లను వెంటనంటి యే
దో మటుమాయవేషమున నుగ్మలి క స్తిని జూచె సత్యమే
'పాము మనుష్యు'డయ్యె ననఁ బామరు లొప్పరు మాటమాత్రచే.

క. మును తక్షకుఁ డొక్కప్పుడు
పురుషాకారమ్ముఁ దాల్చి భూసురు మంత్ర
స్ఫురణమ్ముఁ బరీక్షించెఁ
బురాణముల నిట్టి చిత్రములు వినఁబడెడిఁ. ౧౧౦

క. అతఁడు మరల వెనువెంటనె
స్వతస్స్వరూపమ్ముఁ దాల్చెఁ బ్రజలకు నీతం
డతనిబలెఁ జేయఁ గల్గిన
మతి నమ్మిక కల్గుఁ బెక్కుమాట లిఁ కేలా. ౧౧౧

తే. గీ. తీర్థమాహాత్మ్యముననుఁ బతివ్రతామ
హాత్త్వమునఁ బాము మనుజత్వ మందుఁగాక
మరలఁ బాముగఁ గనుపట్టి మనుజుఁ డగుట
యెట్లు పొసఁగెడిఁ బొసఁగమియే ధ్రువంబు. ౧౧౨

క. సీతాపాతివ్రత్యము
భూతలమే కాదు స్వర్గము నెఱింగెఁగదా!
ఆతఱి నగ్నిం జొచ్చుట
కాతన్వికిఁ గారణంబు నరయ జగంబే. ౧౧౩

క. లోకం బేలెడి చేనికి
లోకాంగీకార మెట్టి లోపము నేనిఁ
బోకార్చు సర్వథా నృప
లోకము యత్నింపవలయు లోకముఁ దనుపన్. ౧౧౪

ఉ. పాండుతనూజులం గొనుచు బ్రహ్మవిదుల్ ఋషు లేగుదెంచి "క్లై
క్యం" డని చెప్పినప్పు "డలఘుల్ మును లాడ రసత్య" మంచు భీ
ష్ముం డెఱుఁగండె? యంబరవచోగతిఁ బట్టి గ్రహింప నేల? భూ
మండల మేలు తేఁడు జనమండలి మెప్పు గడించు టొప్పగున్.

వ. ఇట్లు లోకసమ్మతింగూర్చి లోకోత్తరంబుగా వచించు ధర్మాంగదుని ధర్మవచనంబులకు రత్నాంగదుండును దక్కఁగల యాప్తులును బ్రజలును సమ్మతించి యభినందించిరి, ప్రస్తుతవృత్తాంతం బంతయు బ్రత్యక్షరమును బ్రత్యక్షముగా నెఱిఁగిన సచివుండు తనయెఱింగి నది యెఱింగినట్లుగాఁ జెప్పవలసియున్నను లోకంబున కయ్యది ప్రమాణంబు గాదని మిన్నకుండె, రాకొమరుండు తన బాల్యచరిత్రం బిసుమంతయు నెఱుంగక యమ్మడువున యావనంబుతో జనించుట తక్క నితరం బరయనికతనఁ దనభార్య వ్రతనిష్ఠయే యింతకు మూలంబని పూర్తిగా విశ్వసించియుఁ దా నేమి వచించినను నయ్యది స్వార్థపరత్వదోషమ్మునకు గుఱియగునని మిన్నకుండె, నర్మిలీదేవికి మనఃపూర్తిగా నీతండు తన కొమరుం డను నమ్మిక యుండియుఁ దనమాటకూడఁ బాటింపఁబడ దని తూష్ణీంభావమ్ము వహించెం బదంపడి యాత్రిలోకసుందరి. ౧౧౬

శా. ఆకాశమ్మున దృష్టినిల్పి జగదంబా! దుర్గ! మాయమ్మ! నీ
వే కాదా? యలబ్రహ్మగుండమునయం దే నాత్మహత్యార్థమై
పోఁకన్ దూఁకఁ దలంచుచో వలదు దర్వీహస్తమున్ గంతమం
దోకంజాక్షి? ధరించి ముద్దు మని నన్నోదార్చినా వమ్మయిన్.

క. ఆకాశవాణి యన? నీ
వాకే కాకన్యమగునె? వాస్తవమెల్లన్
వాకొని పాతివ్రత్య
శ్రీకిం గలసత్త నిలుపఁ జెల్లదె? తల్లీ. ౧౧౫

క. నామామ నన్నెఱింగియు
నీమూలమ్మున యథార్థనిర్ణయ మగుటే
క్షేమంకరమని యెంచె
న్నీ మాటకు వేచి యుండె నిఖిలసదస్సుల్. ౧౧౬

చ. కపటము పన్ని కన్నులను గప్పి యెదో గతి సౌఖ్య మందుటే
యిపుడు జగమ్మునందుఁ గల దెందు యథార్థముఁబట్టి పోవుని
ష్కపటులు గొంద ఱుండినను సత్య మెఱుంగుట కష్ట; మాసరీ
సృపమగునా? యితం;డౌరుఁడౌ?చెప్పఁగదమ్మ? జగమ్మెఱుంగఁగన్.

క. ఏనుం బతియును వేఱుగ
స్నానం బొనరింప నెన్నిసార్లకు ఫల మ
మ్మానులు సెప్పిన దగుపడ
కేనున్న తఱిన్ వచించి తేమని తల్లీ ! ౧౨౧

శా. ఆమాటన్ సభయెల్ల నేఁడు విన నీ వంబా ? వచింపన్ వలెన్
నీమాటల్ వినుదాఁక నన్ జగము మన్నింపంగ నుంకింప దీ
నామాతాపిత లన్నదమ్ములు మఱి న్నామామ నాయత్తయున్
బ్రేమం జూపిననేమి ? లోకము ననుం బ్రేమించుటే కామ్యమౌ.

ఉ. "పామును వామలూరువునఁ బాఱఁగఁ ద్రోసి గడించె నీమె యీ
గోమగువాని" నంచు ననుకొందురు కొందఱు; వారితప్పిదం
బేమి? యథార్థమున్ దెలియు టెట్టులు సాక్ష్యము లేక; సాక్ష్యమే
నీమెయి నొద్ద దున్న ఫల మే ? మది యెల్లరు విశ్వసింతురే ?

శా. పాతివ్రత్యమునందు గౌరవము నీభావమ్మునం దున్నచో
నాత్త్వమ్ము పతివ్రతామణులు "మాన్యం" బంచు బ్రేమించుచో
నీతాటస్థ్యము బ్రహ్మగుండమునెడ న్నే నప్డు కైకొన్నచో
నేతదాత్రిప్రభ కెల్లఁ దెల్పుటకు నీ కేశంక? లోకాంబికా. ౧౨౪

తే. గీ. అలసుకన్యకు మఱి దమయంతి కితర
సతులకును నీదుసాయంబుకతనఁ గాదె ?
వారి వారిమర్యాద నిర్వంచితముగ
జగతి నెల్లెడ వ్యాపించె శ్లాఘ్య మగుచు. ౧౨౫

శా॥ పాతివ్రత్యనిధానమైన యలభూపాలాత్మజారత్న మీ
రీతిన్ దోసిలియొగ్గి వేడికొన సుశ్రీ మీఱు రావం బొకం
డేతెంచెన్ విశదాక్షరాకలితమై; యీనారి సత్సాధ్వి ఆ
సీతాదేవిని మించు నీసతికి నాశీస్సేను గావించెదన్. ౧౨౬

ఉ. ఈమెఁ బరీక్షసేయుటకు నీశ్వరుఁడే భయమందు నన్నచో
మామయుఁ దండ్రియున్ దగవు మాలి యెదోయనుటొప్పనే? కటా!
యీమెకు సాటి యీమెయె మఱేసతినేనియుఁ జెప్పఁ బోల దే
నీమెకు వందనం బిడ నొకించుకయున్ వెనుదీయ వింటిరే. ౧౨౭

మ. చదువుల్ నేర్వఁగవచ్చు సత్సభలు మెచ్చన్ "లెక్చె" రీవచ్చుఁ గో
విదమాన్యంబుగఁ గైత చెప్పి బిరుదుల్ వేయేని యార్జింపవ
చ్చు దివారాత్రములం "దుపోషణము" లంచున్ బస్తు గావచ్చు నే
సుదతీరత్న మిదంవ్రతంబునెడ మెచ్చుంగాంచి శోభిల్లెడిన్. ౧౨౮

ఉ. ఇంతటి సుందరీతిలక మీభువియందునె కాదు, లేదు లో
కాంతరమందుఁగూడ; జగమంతయు నొంటిఁ బరిభ్రమించు నీ
యింతిపతివ్రతామహిమ మెంతటిదుష్టు వినమ్రుఁ జేసె శు
ద్ధాంతము లయ్యె నీమెకు వనాంతము లూళ్ళులుఁ బల్లె లధ్వముల్

క. శీలమున మానరక్షణ మేలలన యొనర్చు నద్దియే సతి, భర్తల్
పాలింపఁ బతివ్రితలగు, లీలావతు లెంద ఱేని లేరె? జగానన్. ౧౩౦

వ. ఇట్లంబరవాణి యాపె యోగ్యతను వేనోళ్ళ నుగ్గడించుటయుఁదత్సభ పరమాశ్చర్యంబున నోలాడి పాతివ్రిత్యగౌరవం బిట్టిది కాఁబోలు నని యెఱింగి జయజయధ్వానపురస్సరమ్ముగా నాపె నభినందించిరి. కొందఱు పదధూళి శిరమ్ములం దాల్చి నమస్కరించిరి. కొంద ఱీపెయందు శమీతరువునం దగ్నియుంబలె దాఁగియున్న సౌశీల్యంబును బయటికిఁ దెచ్చినవాఁ డిమ్మహానుభావుండని యమ్మంత్రిపుంగవు నభినందించి నమస్కరించిరి. ఇట్లు మంగళో దర్కంబుగ నానాఁటిసభ ముగియునంత నమ్మంత్రిపుంగవుం డిట్లనియె, దీని కంతకును మూలము జాతకశాస్త్రకోవిదుల పాండిత్యముగాని యన్యంబుగాదు. ఈపె జాతకమును వ్రాసిన దైవజ్ఞ మహాశయుఁ డీ సభయందే యున్నవాఁడు. ఆయనకు నెట్లు సమ్మా నింపవలయునో యోజించి యట్లొనర్చిన నిమ్మట నితరములైన యుత్సవంబు లొనర్చికొనవచ్చు ననుటయు నెల్లరు నేకవాక్యతగా నామోదించిరి. ఇమ్మట నాసచివపుంగవుండు ౧౩౧

ఉ. జ్యోతిషమందు మూఁడుగద స్కంధము; లందున నాద్యమైన యీ జాతకభాగమందుఁ గల సార మెఱింగినవిజ్ఞు లంతగా భూతలమందు లే రనృతముల్ వచియింపని సత్యసంధులే జాతకముల్ వచింపఁదగుసాధువు లన్యు లనష్టు లెమ్మెయిన్. ౧౩౨

తే. గీ. కలదు శాస్త్ర మ్మనంతమ్ముగాఁగ దానిఁ
జదివినంతటిలోఁ బ్రయోజనము లేదు
ఎన్ని యో లక్ష్యములు సైత మెఱుఁగవలయు
నుండవలయు దైవోపాస్తి యొండుకూడ. ౧౩౩

ఉ. భారత మాదిగాఁ గలుగు ప్రాజ్ఞుల కబ్బములందు నెందుఁ జె
న్నారెడిలక్ష్యముల్ తెలిసినట్టి కవీంద్రుల కెల్లు కావ్యసం
సారమునన్ జయం బొదవు జాతకవిజ్ఞుల కల్లె లక్ష్యవి
స్తారవిశేషవిజ్ఞతయు దైవమునుంబలె తోడునీడయౌ. ౧౩౪

తే. గీ. తలఁచ సత్యమ్ము లాడు విద్వాంసుఁ డెన్ని
గ్రంథములఁ జూచెనేని వ్యర్థంబ వాగ్వి
నియతి గల్గిన విజ్ఞు మన్నించి జాత
కపురహస్యంబు కంటి కగ్రమున నిలుచు. ౧౩౫

క. పంచాంగము నిర్మించుట, కొంచెములో నేర్వవచ్చుఁ గోవిదు లిది ని
ర్వంచితముగ నేర్చుటకు స్వమంచితమగు దైవ మండమైయుండవలెన్.

తే. గీ. అట్టికళ తగునాశ్రియ మబ్బకునికిఁ
గునికిపాట్లకు నెరయయి కుందవలసె
నిమ్మహామహుఁ డిద్దాని కిచ్చు హెచ్చు
గౌరవము చేయవలె నమస్కారశతము. ౧౩౬

వ. ఇ ట్లనేకవిధమ్ముల నభినందించి, ౧౩౭

తే. గీ. ఏనుఁగంబారిమీఁద నూరేగఁజేసి
అగ్రహారమ్ము లర్పించి యమ్మహామ
హునికి నాదంపతుల మ్రొక్కు లొనరఁజేసి
అతఁడు దీవించినట్టియనంతరమున. ౧౩౮

చ. వెనుక నొనర్చినట్టి యలపెండిలి "పెండిలిగా" దటంచు న
జ్జనపతి కూఁతు నల్లునకు శాస్త్రవచోగతిచోదితంబుగన్
దను జగమెల్ల మెచ్చఁగను దాన మొనర్చి మహోత్సవమ్ములన్
బొనరిచె బ్రాహ్మణోత్తములఁ బూజితులం బొనరించె హెచ్చుగన్.

చ. పదపడి భార్య వెంటఁగొని పార్థివనందనుఁ డాత్మపట్టణం
బెద ముదమంద నేగి యట నెల్లరు సంతసమంద రాజ్యసం
పద కధినేతయై తగు నపత్యవిభూతికి మేటికీర్తి కా
స్పదుఁడయి తల్లిదండ్రు లెద సంతసమందఁగ నేలె రాజ్యమున్.

తే. గీ. "భోగిరా" జని పాముగాఁ బుట్టినప్డు
మంత్రి పెట్టిన నామంబు మాఱకుండ
సార్థకముగాఁగ క్షితి నేలె నయ్యమాత్యుఁ
డెల్లవిధములఁ దనసేవ మెఱఁగి కొలువ. ౧౮౭

ఉ. ఇంతకుమున్ను మంత్రి నెవ రెవ్వరు దూఱిరొ వారువారు "స
త్స్వాంతుఁ డితండు పార్థివునివంగడము న్వెలయించె నింతధీ
మంతుఁడు లేడటంచుఁ" బలుమాఱు నుతింపఁగఁ జొచ్చి రాశచీ
కాంతయు నింద్రుఁడుం బలె సుఖంబుగ నుండిరి రాజు రాజ్ఞియున్.

క. ఏ తపములు నేజపములు
బాతివ్రత్యమున కున్న పటిమ కలవి గా
పాతివ్రత మొకఁడే స్త్రీ
జాతికి భూషణమె కాదు, సర్వస్వమ్మున్. ౧౮౮

సీ. తల్లి గావలె నట్టి ధన్యాత్మురాలికిఁ, దండ్రి గావలె నట్టి ధర్మమతికి
నత్త గావలె నట్టి యనఘమనీషకు, మామ గావలె నట్టి మానవతికి
భర్తగావలె నట్టి పావనాకారకు, నన్న గావలె నట్టి యనఘగతికి
కొడుకు గావలె నట్టి గుణరత్నఖనికిఁగొమార్తగావలెనట్టిమాన్యురాలి

తే. గీ. కిట్టి చుట్టఱికముల కెంతెంతొ తపము
పండి యుండంగవలయుఁ బైపయిని లేదు
తుదకు వరపుడమైనను దొరకనేని
అయ్యదియుఁగూడఁ గొంత పుణ్యంపుఁ దెరువు. ౧౮౯

ఉ. ఇట్టిపతివ్రతాత్వమున కిక్కఁగదా? మనదేశ మెందఱో
పట్టును బట్టి యీసుకృతభాగ్యము నాశ మొనర్చుపొంటె బల్
దట్టులు నేఁడు కొన్ని పెడదారులు చూపఁదొడంగి రన్నిటి
న్నెట్టుక నిల్వనేర్చె నిది; నీతి సతీమణులందుఁ గల్గుటన్. ౧౪౬

ఉ. వేదము పోయె, శాస్త్రములవిజ్ఞత మాటుమడంగె, నార్యమ
ర్యాదలు రూపుమాసె, నొకఁ డంచు వచింపఁగనేల? సర్వమున్
"మాదిగమంచమై" చెడియె మానినులం దిదిమాత్ర మెట్టులో
పాదుకొనంగఁ జాలెఁ గలి వచ్చి ప్రభుత్వము నిర్వహించినన్.

తే. గీ. భర్త లెన్నివిధమ్ములఁ బాడువడఁగ
వలయు నన్నివిధమ్ములఁ బాడువడినఁ
గాని భార్యలు వారలఁ గాదు నాక
మెలఁగుదురు శీల మీషత్తు తొలఁగకుండ. ౧౪౮

ఉ. అక్కజ మేమి? నాఁడు కలి యక్కసమూని "తనున్ వరింప" డం
చక్కసుతోడ సారె దమయంతినిఁ బెట్టిన తిప్పలెల్ల స
మ్యక్కృతికర్త తెల్పఁగద! వ్యాసుఁడు; వ్యర్థములయ్యెఁ గాని యా
యక్క పతివ్రతాగరిమ మయ్యవి లేశము మోసగించెనే? ౧౪౯

ఉ. తిట్టునుగాక భర్తను బడింబడిఁ గోపము వచ్చి; యొక్కచోఁ
గొట్టునుగాక యెవ్వతెయొ! గోతి ప్రధానపుదుర్గుణమ్ము లే
నట్టిపతివ్రతామణుల కాకర మీకలిఁగూడఁ బున్నెపుం
బట్టగు భారతావనియె; మాలల మాదిగలందుఁ జూచినన్. ౧౫౦

తే. గీ. ఏకపత్నీవ్రతంబున కెన్నిరెట్లొ
యేకపతికవ్రతానకే హెచ్చు విలువ
నిచ్చిరి ఋషీశ్వరులు; కొంద ఱిపుడు రెండు
సరిగఁ దూఁచెద రిది వృథాసాహసంబు. ౧౫౧

సీ. ఒకపతివ్రతనామ ముచ్చరించినమాత్ర
నుదయింప కొక్కచో నొదిగె సూర్యుఁ
డొకపతివ్రత కోడి యొడిలోని పిల్లలై
యలత్రిమూర్తు లుయేల నాడఁదొడఁగి
రొకపతివ్రతమేని యుష్ణత్వమునకు బే
జారయి యగ్నియుఁ జల్లవడియె
నొకపతివ్రతను జెనకనెంచిన కిరాతుఁ
డల్లన నిలువునీఱై నశించె
తే. గీ. నేకపతికవ్రతంబన నిట్టి; దేది ?
యేకపత్నీవ్రతంబున కింత 'పవరు'
రాముఁడేకాక సీతయే రావణాసు
రుని వధించిన నంతయతనమదేల ! ౧౫౨

తే. గీ. ఏకపతికవ్రతము లేనియింతి యెంత
పలుచనగు నందు నూఱవ వంతుగూడఁ
బలుచగాఁ డేకపత్నికావ్రతుఁడు గాక
నెమకఁ బనిలే దుదాహరణములు కోటి. ౧౫౩

ఉ. రాముఁ డొకండు దక్క మనరాజులయం దిఁక నేకపత్నికా
శ్రీమహితవ్రతుండు నృపశేఖరుఁ డన్యుఁడు లేఁడు ధర్మరా
జేమి? తదన్యులే యొక తెనే సతి నేలినయట్లు లేదు త
త్స్వముల నేవగించుకొను వారలు నేఁడును గానరా రిలన్. ౧౫౪

తే. గీ. ఏకపత్నీవ్రతముగూడ హెచ్చుగౌర
వమ్మునకుఁ బాత్రమగుటది ప్రాజ్ఞసమ్మ
తంబ కాని పతివ్రతాత్వమున కున్న
పాటవము వేఱు దానికి సాటి లేదు. ౧౫౫

తే. గీ. ఎంత శాస్త్రీయ మైన మ తెంతమంది
పెద్ద లొప్పికొన్నను నొక వెలంది యొక్క
పతికి మించి వరించినఁ బలుచగాక
తీర దిందుకు ద్రుపదపుత్త్రికయె సాక్షి. ౧౫౬

ఉ. జూదము నాడి గెల్చినను సుందరి ద్రోవది నంత నీచమ
ర్యాదకుఁ బాలుసేయుటకు నాపె కనేకపతిత్వదోషమే
చోదకమయ్యె లేకునికి సూతసుతుం డటు లాడ గుండె లు
న్నే? దొరలున్న యాసభ "నిదే" మని యెల్లరు మందలింప రే?.

క. అం దప్పుడున్న భూపతు
లందఱు దుశ్శాసనులె? యథార్థము ఖండిం
పం దరము గాక కాదే?
నిందావాక్యమ్ము లటు వినిరి కర్ణములన్. ౧౫౮

వ. ఎన్నివిధమ్ములఁ బరిశీలించినఁ బాతివ్రత్యమ్ముకన్న స్త్రీకి గౌరవా పాదకం బగునది కనుపట్టదు "పురుషులు బహుపత్నీకు లున్నట్లే స్త్రీలును బహుభర్తృకలుగా నున్ననేమి ?" యనువారి పలుకులు సమంజసములుగా వని వెండియు. ౧౫౯

క. కారణ మిది లేకుండిన
నారిబ్రదుకు "కుక్కలకును నక్కల కెఱుకై"
నీరసమగుఁ బురుషుని బ్రదు
కారీతికి వచ్చినట్టు లగుపడ దెందున్. ౧౬౦

వ. ఈవిషయంబు వితండవాదమ్ములవలనఁ దేలునదికాదు, వారు వారు స్వాత్మసాక్షికంబుగా వితర్కించుకోఁదగ్గది, పాతివ్రత్యమ్మును మించిన దేదియు లేదనునది సర్వసమ్మతంబు. ౧౬౧

ఉ. ఇట్టిపతివ్రతామణుల కిక్కగ నుండుకతంబో? యేమొ? యి
క్కట్టులు తక్కు వీ భరతఖండనివాసుల; కన్యదేశ మి
క్కట్టులపాలు గాఁగఁ గనుగందద యీభువి; నిక్కమీస్థితిం
బట్టి పతివ్రతామహిమ బాగుగ గోచరమౌ గణించినన్. ౧౬౨

శా. పాతివ్రత్యముపేరు విన్నయెడ మద్భావంబునం దేమొ? స
ర్వాతీతంబగు నాదరం బుబుకుటన్ వ్యాఖ్యానమున్ జేసితిన్
సీతన్ గల్పితపాత్రిగాఁ దలఁచువా ర్చేతమ్ములం దన్యథా
చూతు ర్గాక తదన్యులిక్కతయెడన్ జూపింతు రత్యాదృతిన్. ౧౬౩

క. పాతివ్రత్యము సత్య, ప్రీతియుఁ బితృమాతృభక్తి విఖ్యాతికినై
చేతము చొన్పుట వీని క,నేతాదృశగౌరవమ్ము నిచ్చెద రార్యుల్.

వ. ఇట్లుపన్యసించు నయ్యుపన్యాసకుని సదస్యులెల్ల మిక్కిలిగా గౌర
వించి యభినందించి పూజించిరి. ౧౬౪

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కృతిసందర్భము

## జ్యోతిశ్శేఖరము



చ. అలరెడి గాథ యొంటు గొని యల్లితి నీఁశ్లోకకబ్బ మింతలో
పల మును నేను బందరున వాస మొనర్చెడికాలమందు న
ర్మిలిమెయి నన్ను దేశికునిరీతి సదా భజియించునట్టి "క
మ్మెల"కులజుండు శేషగిరి మేలిమితమ్ముఁడు శేఖరుం డొగిన్. ౧

చ. తనతొలినాఁటిపున్నెముకతమ్మునఁ దాను జమీనుదారుఁడై
నను ఘనులైనయట్టి జననాథులు చేసినయట్లు గౌరవం
బొనర బహూకరించుటకు నుత్సుకుఁడై కృతనిశ్చయమ్ముతోఁ
దనరుట వింటి నంతటియుదారత కక్కజమందఁ జొచ్చితిన్. ౨

వ. శేఖరరాయంతు నా యందింతటిపేర్మిఁ జూపఁదగు కారణంబు మృగ్యంబు; ప్రతిష్ఠాకామి యనుకొంద మన్న నితం డంతర్ముఖుండు గా నుండి తనవ్యాపారము చూచుకొనువాఁడు గాని బాహ్యాడంబరమ్ము లీతనికి బొత్తిగా గిట్టవని నేనకాదు పలువు రెఱుఁగుదురు. ఇట్టివాని కిట్టి యూహ జనించుట కంతఃకారణ మ్మెట్టిదైనను బైకి నగపడునది నన్నధమర్ణుఁగాఁ జేయుతలంపు గాని యన్యంబు గాదు. ఇయ్యది కృతయుగమునకు సంబంధించిన యీవి గాని కలియుగపు టీవి యెంతమాత్రమును గాదు. 3

ఉ. ఈతనియన్న శేషగిరి కెంతయు నాయెడ భక్తియుండుఁ గా
కాతనితమ్ముఁ డొ కతమె యానొకొ? న న్నటు సత్కరింపఁగాఁ
జేతమునం దలంచుటకుఁ జిహ్నము; వే ఱెదియేని యుండునో?
"చూత"మటంచు నే వెదకి చూచితిఁ జూచితి నొండు గాంచితిన్. ౪

చ. ఇతనివివాహకాలమున కేఁ జన నెంచియు నేగలేమిఁ బం
చితి నొక* మైదుపద్యములు శ్రీయును నాయు వెసంగు మంచి జీ
వితమున కాస్పదం బగుచు వృద్ధికి వచ్చెడునట్లు దీవనన్
మతిఁ దలపోసి; దానిబహుమానముగాఁ దగు నంచు నెంచితిన్. ౫

శా. ఛందోబద్ధము గాఁగఁ గూరిచి మనస్సంపూర్తి నే నెప్పుడే
నిం దీవించిన మంచియేని చెడు గేనిన్ దాన నున్నట్టి ద
స్పందంబై "ఘటియించి తీరు"నని యీప్రజ్ఞాధురీణాత్ముఁ డా
నందంబందుచుఁ బల్కుచుండు నను సన్మానించి వర్ణించుచున్. ౬

---

* బందరు - ప్రొఫెసరు శేఖరరావు వివాహము

క. శ్రీయువతియనుగ్రహమున, నీయన్నంబలెనె సిరికి నెలవై సతతం
బాయుర్భాగ్యాదికముల, కాయతనం బగుము శేఖరా! సతితోడన్.

క. నీయన్నకు మంగళగిరి, రాయండగు పానకాలరాయఁడు పెండ్లిన్
జేయించె స్వసన్నిధి; నీ,కాయన స్వగృహమ్మునంద యదికావించెన్.

శా. నీయన్న న్మనమందుఁ బెట్టికొనుచు న్నీ వెందు వర్తించుచో
శ్రేయస్సుల్ దమయంత నీకు వశమై చేమోడ్పు గావించు నా
యీయౌన్నత్యము నీదునన్న కెటుగా నేర్పడ్డదన్నన్ శిశు
ప్రాయం బాదిగఁ బెద్దలందు మిగులన్ భక్తుండుగా నుంటచే. 3

మ. ధన మార్జించినవారు పెక్కురిలలోఁ దత్తన్మహాభోగులన్
ఘను లేమాత్రముఁ జేరికిం గొనరు నిక్కమ్మింత నీయన్న యే
గొనముం గాంచి కవిప్రియుం డగుచు శ్లాఘ్యుం డయ్యెనో? దానియం
దున నే నీమది సంచరించుత సదుద్యోగుల్ ప్రశంసింపఁగన్. ౪

మ. ధనమున్ విద్దెయు నీకు సర్వమును సిద్ధంబై యెసంగెంగదా ?
వనితారత్నము చెట్టఁబట్టితివి తద్వాల్లభ్యముం గాంచి య
న్నను శ్రీశేషగిరిన్ గణించి యలసంతానమ్మునుంబోలెఁ జ
క్కనిసంతానము సోమశేఖరవరా! కాంచంగ దీవించెదన్. ౫

(నానారాజ సందర్శనము చూ.)

చ. చదివిన దేమొ హూణకళ జాతకవిద్య స్వయంకృషిన్ జగ
ద్విదితముగా గడించె నది "వీని పురాకృతపుణ్యలేశసం
పద" యని నే వచింపఁగ లవంబును గొంకను వీసిసర్వసం
పదకును జాతకప్రబలపాండితియే జనకం బెఱుంగుదున్. ౭

ఉ. ఎప్పుడు పుట్టెనో? పృథివి యెవ్వఁ డెఱుంగును జాతకాంశముల్
చెప్పెడివారునుం గలరు శిష్టులు పల్వురు; వార లొక్కరున్
గుప్పెఁడు రూపికల్ గనుటకున్ మఱి నోఁచరు; రావు శేఖరున్
జెప్పెడి దేమి? లక్ష లఱచేత నిమిడ్చె మహాద్భుతంబుగన్. ౮

సీ. వ్రాసెనా? జన్మచక్రము బ్రహ్మవ్రాఁతయై
పొల్లువో దది ఫలమ్ము లిడుపట్ల
కట్టెనా? లగ్నమ్ము చట్టన సరిపోవు
జన్మకాలము లేని జాతకులకు
గుణియించెనా? గ్రహకోటిబలాబల
మ్ములు త్రాసునం దూఁచుపోల్కి నుండు
వచియించెనా? ఫలప్రచయంబు లల్లనా
డీగ్రంథమ్ములను డీడిక్కి గొట్టు

తే. గీ. కనుక నే ఆంధ్రదేశమ్ము గాక ద్రవిడ
దేశమును గాక యెన్నొ విదేశములకుఁ
బ్రాఁకి యక్కజ మొనరించె రావు శేఖ
రునిప్రతిభ యిట్టివాఁ డొక్కరుఁడును లేఁడు. ౯

తే. గీ. వట్టిజాతకచక్ర మిట్టట్టుఁ జూచి
జననవత్సరమే కాక జననసమయ
మితేఁడు సెప్పెడి నిమిష మే నెచ్చు తగ్గు
రా దటులు సెప్ప శేఖరరావు ఘనుఁడు. ౧౦

వ. మఱియును జాతకచక్రము చూచినతోడనే యయ్యది స్త్రీజాతకమో? పురుషజాతకమో? యితండు చెప్పెడి మఱికొందఱుగూడ నిట్లు చెప్పుట కలదు గాని యింత నిష్కర్షగాఁ జెప్పఁ గలవారలు గడుంగడు మృగ్యు లగుటంజేసి పేర్కొంటి మఱియును జననదినము మాత్రము చెప్పినఁ బంచాంగము చూడకయే చక్రము వేసి యిచ్చిన నయ్యది లోఁగడ నున్న జాతకచక్రమున కించుకయు భేదము లేక సరిపోయెడి నీప్రశ్నలలోఁ గొన్ని ప్రశ్నలుగల వారిని నే నెఱుంగుదును గాని యిన్ని ప్రశ్న లేకత్ర గలవారరుదని యిం దుదాహరించితి.

తే. గీ. గ్రహబలము చాలనప్పు డాగ్రహబలమ్ము
సరిపడుట కీతఁ డిచ్చు నుంగరము లవల
నట్టిదోషమ్ము తొలఁగెడి నది యథార్థ
మనుట కితరదేశస్థులౌ ఘనులె సాక్షి. ౧౨

సీ. అప్పున్నవారల యప్పెట్లు తీరునో?, ఆయుపాయం బీతఁ డరసి చెప్పు
ఇతఁడు నిరుద్యోగి యెట్టులుద్యోగియౌ?, నట్టియుపాయమ్ము నరసి చెప్పు
నారోగ్యలోపాన నటమటించెడివారి, కది యెట్లు తీరునో అరసి చెప్పు
నెట్టి కష్ట మ్మందు నట్టివారికిఁగూడ, సుఖపడుత్రోవను జూచి చెప్పుఁ

తే. గీ. గలరు దైవజ్ఞు లెందఱో కష్టసుఖము
లున్న వున్నట్టుగాఁ జెప్పుచుండ్రుగాని
యితనిబలె నీటి కెదు రెవ్వ రీఁదలేరు
కాన నీతనిప్రజ్ఞ యక్కజము గొలుపు. ౧౩

తే. గీ. పూర్వజన్మంబున నొనర్చు పుణ్యపాప
ములనుబట్టిన సుఖదుఃఖములకు భోగ
మొక్కటే తక్క నితర మే ముండుననెడి
వారిజ్యోతిష మేరికిఁ బనికి వచ్చు. ౧౪

ఉ. వానికిఁగూడ శేఖరుఁ డుపాయములన్ గనిపెట్టి వైద్యుఁ డా
యా నరులన్ రుగార్తుల నిరామయులం బొనరింప మందు లే
వేని యొసంగినట్లె యొగి నిచ్చెడి నుంగరముల్; మహేవియో
తాను నుపాయముల్ తెలిపి ధన్యులఁ జేసెడిఁ బృచ్ఛకావళిన్. ౧౬

క. రోగమ్మునకున్ బలె దు, ర్యోగమ్మునకు న్నివారణోపాయంబుల్
ధీగణ్యుఁడు శేఖరుఁడు స,దా గనుఁగొని చెప్పి జనుల ధన్యులఁ జేయున్.

వ. పై విషయము చాల వివాదగ్రస్త మని నే నెఱిఁగియు విశ్వసించుట తప్పని విధియై విశ్వసించి యిందుదాహరించితి, జ్యోతిశ్శాస్త్రమని యొకటి యుండి దానివలన జాతకుల భావికాలపు మంచిచెడ్డలు తెలిసికొనుట కవకాశ మున్నదని యొప్పికొనువారలు తన్నివారణోపాయంబులు గూడ నున్నవని విశ్వసింపనిచో నవి తెలిసికొని ఫల మే ముండెడినని తొల్లి చిట్టావూరి లక్ష్మీపతిశాస్త్రి యను దైవజ్ఞ వృద్ధుండు సెప్ప వినియుంటి. అంతియకాక ఆయనఘుఁ డా యుపాయంబుల నాచరించి తత్ఫలితములుగూడఁ బ్రత్యక్ష మ్మొనర్చెను. ఆ హేతువుచే నే నీవిషయముఁగూడ విశ్వసించి యిం దుద్ఘాటించితి. ౧౮

తే. గీ. కలవు ఖండాంతరస్థు లీకలనుగూర్చి
చెప్పినట్టి కబ్బమ్ములు గుప్పగూర
లరసె నవియెల్ల శేఖరుం డంతెకాద
ఆస్థ మెయి నేగి చూచె ఖండాంతరములు. ౧౯

తే. గీ. ప్రాచ్యత జ్యోతిషగ్రంథస్థఫలము లిప్పు
డెట్లు దృష్టాంత మిచ్చునో అట్లు తా స
మన్వయ మొనర్చికొని యీతఁ డల్లశాస్త్ర
మందుఁ బేరందె భాగ్యభోగ్యములు నందె. ౨౦

క. ఈ విషయమ్మును వ్రాయఁగఁ
బోవునెడన్ వ్రాయవలయు బోలెఁడు ముఖ్యం
బే విజ్ఞులు సీతని బలె
దైవజ్ఞులు యశము గొనరు ధనమున్ గొనరున్? ౨౧

శా. ఘోషాస్త్రీబలెఁ గాదు యోగియుబలెం గూర్చుండు నొక్కండు సం
తోషం బాస్యమునందుఁ దోఁప; నెవరి నొన్నాడఁ డెవ్వారితో
భాషింపం డగుదాత కాఁడనియు జెప్పన్వచ్చు నేపాటి దు
ర్దోషం బొప్పనిగేస్తు శేఖరుఁడు సంస్తుత్యార్హుఁ డౌనేకదా? ౨౨

ఉ. విప్రుఁడు గాఁడుపో! జనికి విప్రుఁడు విద్యల భుక్తిపట్ల స
ద్విప్రుఁడు స్నానసంధ్యలను వేత్త్ర్యుతపట్టునఁగూడ విప్రుఁడే
అప్రతిమానబుద్ధిబలుఁ డార్జకుఁ డెంతయు జ్యోతిషమ్మునన్
సుప్రథితుండు శేషగిరిసోదరుఁ డాదరణీయుఁ డన్నిటన్. ౨౩

క. జనకుఁడు నృసింహనాయఁడు
వినఁబడు రూపసియుఁ గడువివేకి యటంచున్
జనయిత్రి లక్ష్మిదేవియు
వినఁబడు సౌశీల్యవినయవిద్యావతిగన్. ౨౪

వ. మఱియు నీపెకు.

తే. గీ. ఒక్కయొజ్జ నాదెళ పురుషోత్తమకవి
వేఱొకగురుండు సుమనీషి బేతపూడి
వంశ్యుఁడు ప్రకాశుఁ; డీగురువరులవలన
వింటి నాపె విద్యాబుద్ధివిలసనములు. ౨౫

క. "తల్లిం బోలిన సుతు సం
పల్లలన వరించు" ననుచుఁ బల్కుట నిజమే
"కల్ల వచింపరు బుధు" లని
యిల్లలితునిసిరిని బట్టి యెఱుఁగంగ నగున్. ౨౬

ఉ. అంతయు నింత గా దితనియార్జన జాతకవిద్య లక్షలే
యింతయుఁ గాదు దీన మఱి యెన్నవవంతునుగూడ మున్ను సి
ద్ధాంతి యెవండు తెచ్చె ధన మద్దిరె? యింటనె కూరుచుండి; దే
వాంతకుఁ డయ్యు దేవునెడ వాస్తవభక్తుఁ డితం డతండు ప్రియుఁడుర్. ౨౭

చ. మొదట జమీనుదార్లపిలుపుల్ గణియించుట కొంత యుండె నా
పదపడి వారు వచ్చి తనద్వారమున న్నిలఁబడ్డయేని వీ
లౌదవునా? లేదా? య న్విషయ మొండొకఁ డేర్పడెఁ గాకయేమి? సం
పదగలవాని కొండొకరిభాగ్యముతోఁ బని యంచు నుండునే. ౨౮

క. ధన మటు లుంతేము జాతక
మును జెప్పెడి యెవరుగాని మును పీవిద్యాం
గన కింత గాదుగద? యిం
దున నెన్నవవంతు నాబుధులు పెంపిడిరే? ౨౯

చ. చదివి గణించె నాంగ్లమునఁ జక్కని పాండితిఁ; బైన నాంగ్లమం
దొదవెడి జ్యౌతిషంపుగళ నోర్మి స్వయంకృషి చేసి నేర్చె ని
య్యది యసమానమౌకతన నక్కజమౌ నిఁక మాతృభాషయో?
చదువకయే గ్రహించెఁ గనఁ జాలుఁ గవిత్వపు మర్మకర్మముల్. ౩౦

శా. నాకావ్యంబుల నే నెఱుంగని యనూనంబుల్ విశేషంబు ల
స్తోకప్రజ్ఞుఁడు సోమశేఖరుఁ డొగిన్ జూపించు నాయంశముల్
సాకల్యంబుగ నాలకింపఁ దుదకున్ సారంబు మద్వాక్కునం
దేకొంచెమ్మును "బీఱు వో" దని యితం డీక్షించుటల్ తేలెడిన్.

తే. గీ. ఇతని జ్యౌతిషప్రజ్ఞలో నెంత నమ్మ
కంబు నా కున్నదో? నాదుకవనమందు
నితని కంతయు లే కంత కెచ్చొ నమ్మ
కంబు గల దక్కతమ్మునఁ గలిగెఁ బేర్మి. ౩౧

శా. అంతేవాసియుఁ గాఁడు నా కితఁడు; నే నాబందరుగ్రామపుం
బ్రాంతమ్మందున నుండునాఁటికిఁ గడుఁ బాలుండు; సోదర్యుఁ డే
సుంతో శిష్యుఁడు వాని శ్రేయము నను జూపు న్నిమిత్తమ్ముగా
నింతే బంధుత నాకు శేఖరున కే యీషత్తు లేదేదియున్. ౩౩

ఉ. పాఱులపేరు విన్నయెడ "బగ్గున" మండెడి కాలమందు సం
సారి యితండు శూద్రుఁడును జ్ఞాని వివేకి ధనాఢ్యుఁడున్ జమీన్
దారుఁడు నయ్యు బ్రాహ్మణుని నన్నొక దేవరగాఁ దలంచి వి
స్తారపుభక్తి చూపుటది చాలక యెంచె బహూకరింపఁగన్. ౩౪

చ. ఇతఁడు జమీనుదార్పదవి నెప్పుడు గైకొనె నప్పుడే సమ
ర్చితు ననుఁ జేయఁగాఁ దలఁచు చిహ్నము లేర్పడెఁగాని దానికిం
గుతుకమ్మమై నను బిలిచెఁ గొండొక కొండలయూళ్ళ; కట్టిశ
క్తత గలవాఁడఁ గామి నది తా ఫలియింపద యెన్నినాళ్ళకున్. ౩౫

క. ఫలియించుఁగాక లేదా?
ఫలియింపకపోవుఁగాక ప్రాజ్ఞుఁ డెవండున్
ఫలితముఁ జూడం డతనికిఁ
గలిగిన యీయూహ మెచ్చఁగాఁదగదె? కవుల్. ౩౬

క. సకలము ఫలియించుటయును
సకలము ఫలియింపమియును జరుగదు సచ్చిం
తకునై "కర్మణ్యేవా
ధికార" యను సూక్తికతన దేవుఁడె మెచ్చున్. ౩౭

ఆ. వె. పాపపుణ్యములకుఁ బరమార్థదశయందు
మానసప్రవృత్తి మాన్య మగుట
కెల్లవారు నొప్పు టేనెంచి యితనిమ
నోరథంబు నింత గౌరవింతు. ౩౮

వ. అది యటు లుండె నీకఁ బ్రకృతము వక్తవ్యం బేమన. ౩౯

చ. అపు డొకనూఱునాఱు నిడునట్టిదియై జనియించి నాఁడునాఁ
డుపచితిఁ గాంచె వడ్డి కిడు నూర్జితుద్రవ్యముఁబోలెఁ, దానఁ బ్రి
త్యుపకృతిఁ జేసి యాఋణము నుంచక తీర్పఁదలంచి కైతచేఁ
గృపణతఁ బాపికోఁ దలఁచి వృద్ధతకల్మిని గొంత గొంకితిన్. ౪౦

క. జ్ఞానము భక్తియు వైరా
గ్యానకు ననుకూలపడెడి యంశమ్ములుఁ ద
న్మానసమున కిష్టము లని
యే నెఱుఁగుదు శిష్యుఁ డొక్కఁ డిట్టులె చెప్పెన్. ౪౧

క. ఇతని కితరకృతి యెందుకు
"స్వతశ్చరితపురుషుఁ" డని విచారించుచు వృ
ద్ధతకతన నొగిలి యెట్లో
అతికితి నిట నతనిప్రజ్ఞ వ్యాపృతి కెక్కన్. ౪౨

తే. గీ. నిజముగా సీతనిచరిత్ర నేను దగిన
యోపిక గలాఁడ నొచు వ్రాయుదునయేని
నవరసమ్ములతో నిండి కవనమునకుఁ
దగిన దగు నేమిసేతు వృద్ధతకు లోఁగి. ౪౩

వ. అక్కడతమ్మున నితరాంశములు వదలి ప్రధానంబును సీతని వైశ్వ
ర్యమ్మున కెల్లఁ గాణాచియు నగు జ్యోతిఃపాండిత్యమును గూర్చి
మాత్రమే యిం దుద్ఘాటించి దానికిం దోడుగా నొక పతివ్రత
చరిత్రమ్ము నలంకరించితి. ౪౪

ఉ. బందరు కాపురమ్ము నెడఁబొసినపిమ్మట శేఖరుండు వ
చ్చెం దనయన్న పంపఁ బనిఁ జేయఁగ "బోష్టు"న నొక్క "మాస్టరై"

యిందిర కాకరంబయిన యేలురిపట్టణ మప్పురిన్ వరిం
చెం దెరచాటు లేకయె సుశీలుని శేఖరు నెల్లభాగ్యముల్. ౪౫

చ. వలవదు మానుకో వలదు వల్వదు "పోష్టున నున్న "మాస్టరీ"
అలఘుతరంబుగాఁ బెరుఁగు నప్పటి కప్పటి కిందు జీత" మం
చలతనమిత్రు లెంతయిన నాదృతిఁ జెప్పిరి గాని దీన ల
క్షులు గడియించువాని కటఁ గా లెటు నిల్చు స్వతంత్రజీవికిన్. ౪౬

ఆ. వె. "పోష్టు" పనికి వచ్చి పొరుగూరిలో నున్న
కాలమందు జాతకములు సెప్పు
ప్రజ్ఞ వలన నింత ప్రాబల్య మెటు లబ్బె
దైవబలము కాక తనబలంబె? ౪౭

ఉ. దైవ మనంగ నెట్టిదగు? దానిని జూచినవాఁ డెవండు? కా
ర్యావసరంబుపట్ల నలసాత్ములు "దైవ" మటందు రంచు నే
రో! వివదించువారు గల రుర్విని బల్వురు; వారు శేఖరున్
భావమునందు నెంచి తమభ్రాంతి నిఁకేనియు వీడుకోరొకో! ౪౮

ఉ. రావణునంతవాఁడు మనరాముని ముందట వీసమేనియున్
జేవగలాఁడు కాక చెడెఁ జెన్నటిదైవము కారణమ్ముగా
దైవబలంబు చాలక వృథా యడవిన్ జరియించు రాముఁడో!
దైవబలంబు చాలి వసుధాపతియై సుఖియించెఁ బిమ్మటన్. ౪౯

క. మనవిజ్ఞు లెల్లరును దీ
నిని నమ్మిరి శేఖరుండు నెమ్మది నమ్మన్
దనశక్తికి దైవము తో
డని యక్కతమునన కాదె? యది శోభించెన్.

తే. గీ. శేఖరాగ్రజుఁడైనట్టి శేషగిరియు
మాట వరుసకుఁ దనకు నమ్మకములేని

పగిది వాదించుఁగాని యా ప్రాజ్ఞు నంత
రమ్ము నెఱిఁగించునట్టి*పద్యమ్ము గలదు. ౫౧

క. యూరపు "లో దైవం" బను, వా రసలే యుండ రేమొ? వారల కీతం
డారాధ్యుఁ డయ్యె నెంతటి, ధీరుఁడొ! శేఖరుఁడు కవులదీవనఁగొనుతన్.

వ. ఇది యిటులుండె నెవ రెంత వలదన్నను దనప్రజ్ఞ యందలి గాఢ
మగు నమ్మికకతనఁ "బోస్టుమాస్టరీ"నితఁడు వదలుకొనియె నన్నది
వక్తవ్యాంశము. ౫౩

చ. అదిత్యజియించి వచ్చిన యనంతరమేనియు శేఖరుండు త
త్పదమున నున్న సఖ్య మది పాయఁగ వీల్పడదయ్యెఁ "బోస్టుపో"
స్టది సకలమ్ము శేఖరునిదై పనిఁ జేసినఁగాని తీరన
ట్లొదవెను "వర్కు" జాతకము లూరక వారక వచ్చి వ్రాలుటన్.

మ. మనలన్ హస్తములు పట్టిపించుటయె సామాన్యమ్ముగాఁ బూర్వముం
డెను నేఁడీతని జాతకప్రతిభకున్ దేశాంతరస్థుల్ సదా
ధన మర్పించుటఁ జేసి తద్ధనపదార్థంబెల్లఁ గాకున్న నం
దున నేమాత్రమొ "వాప" సైనయటులే తోఁచున్ బరీక్షించినన్

క. ఒకవణిజుఁడు శేఖరు ప్రశ్నకతన లాభంబు నంది నవరత్నరుచిన్
"బకపక"లాడెడి కేయూ,రకములుబహుమాన మొసఁగె రాజోచితముల్.

తే. గీ. ఇట్టి బహుమానములు లెక్కపెట్టవలసి
వచ్చుచోఁ జాలగ్రంథమ్ము వ్రాయవలయుఁ
గల రదృష్టశాలులు పల్వు రిల మఱెందు
శేఖరుం డందులో నిందు శేఖరుండు. ౫౭

---

*మ. అరయన్ నాదగు తల్లిదండ్రుల సమాఖ్యల్ దాల్చి యమ్మంగళా
ద్రిరహిన్ నిల్చియు నాత్మపాదములు భక్తిం గొల్చు నన్నెప్పుడుం
బరిరక్షించి ఘటించె మత్పరిణయప్రాగ్భార మేజంటు, ఆ
నరసింహప్రభు నాదిలక్ష్మి నెదలోనన్ గొల్తు నశ్రాంతమున్.

తే. గీ. శరభశాస్త్రికతమ్మునఁ జాలఁ బెద్ద
గా వెలింగెను బిల్లన గోపిపాట
జాతకజ్యోతిషపుఁబేరు చాలఁ బెద్ద
పేరు గాంచె శేఖరరావు కారణమున. ౫౮

శా. నారంగాలకు "నాను బ్రోమినసు"కుఁ నాణెంబు నేఁ డబ్బె, నం
చేరో రాజను హేంద్రపట్టణమునం దెవ్వో యనన్ వింటి న
ల్లే రాజిల్లెడి జాతకప్రతిభ నేఁ డీ ధీనిధిం బట్టె; త
ద్దారిద్ర్యప్రథ శేఖరున్ దలఁచినన్ దాదవ్వుగాఁ బాఱెడిన్. ౫౯

క. 'శేఖరుఁ' డను పేరితని, వైఖరి భావి గనిపెట్టి వలచెనొ? భూమీ
లేఖులె కనుఁగొని పెట్టిరొ!, శేఖరుఁ డది సార్థకంబు చేసెం బ్రజ్ఞన్.

ఆ. వె. అసలు కొంత కలిమి యొసఁగు నన్వయమునఁ
బుట్టెఁ బిదపఁ జెఱువు వట్టిపోయె;
వట్టిపోయి యన్న వలనఁ గొంత చెమర్చెఁ
గమలవసతి యితని కతన నయ్యె. ౬౧

ఉ. జాతకవిద్య కగ్రికులజాతులు విప్రులకాలమందుఁ బ్ర
ఖ్యాతము దైన్య, మయ్యది సమస్తము నీమన సోమశేఖరుం
డూఁతము గాఁగఁ బోయినది "ఉచ్ఛతరం" బనఁగా? నదెంతయో?
వాతికిఁ బేర్కొనం దగని వైభవ మబ్బిన దక్కజంబుగన్. ౬౨

ఉ. ఎక్కడి "ఆఫ్రికా" మఱియు నెక్కడి "యూరపు" ఖండ మద్దిరా?
యెక్కడి దా "సిలోను" మఱి యెక్కడి దల్ల "జపాను" శేఖరుం
డిక్కడనుండి యేది వచియించు నదే శ్రుతి గాఁగఁ గర్ణముల్
నిక్కఁ గనుంగొనంగను బలే? యితఁ డేతప మాచరించెనో? ౬౩

ఉ. అన్నకు "మెస్మరీజము"న నత్యధికంబగు ప్రజ్ఞ; శేఖరుం
డన్నకుఁ దీసిపోఁడుఁ మరియాదకు "గార్నరు" లోనుగాఁగ న

త్యున్నతు లద్ది చూచి యిడి రుత్తమమైన "మెడల్సు" జ్యోతిష
మ్మెన్నఁడు నేర్చెనో? యెఱుఁగ మేనును నన్నయు నన్యులాప్తులున్.

శా. తోలున్ బొమ్మలపేరు మాఱె నిపు డెందున్ మేల్ "సినిమా"లు రా
నేలూర్పట్టణ మేగు పైనితని యాయీ జ్యోతిషం బెల్లదే
శాలన్ వ్యాప్తృతిఁ జెంది గౌరవము తచ్ఛాస్త్రినకుం దెచ్చె నే
కాలమ్మందును దీని కిట్టిదశ గల్గన్ లేదు రాఁబో దిఁకన్. ౬౫

ఉ. వేలకు వేలు గాఁ దనకుఁ బెద్దలు ఁబిన్నలు వ్రాయు నుత్తరా
లోలిఁ బఠింపఁగా సమయ ముండమి శేఖరరావు తా గుమా
స్తాలను బెట్టికోవలసెఁ దాదృశుఁ డింకెటు "పోస్టు"లో "గుమా
స్తా"లను గూడి "పోస్టు" పని చక్కఁగఁ బెట్టఁగ నేర్పుఁ జేర్చుచున్.

క. వందలు ప్రారంభంబై, యిందిర వేలకును మిగిలి యేపై యాపై
మందిరమున లక్షలు గురి,సెం దైవానుగ్రహంబు చెప్పం దరమే?

శా. ఆడెం బెండిలి, సంతతిం గనె, నపత్యప్రాప్తితోపాటు చే
కూడెన్ వచ్చి జమీను, సజ్జనులతో గోష్ఠీవినోదంబు రా
పాడెన్ బున్నెపుఁగార్యముల్ సలుపుచో ప్పంతన్ బ్రసక్తించుటన్
జూడన్ ముచ్చట గొల్పె శేఖరుని తజ్జ్యోతిఃకలాభ్యున్నతుల్. ౬౮

శా. పూర్వాచారములంద శేఖరునికిం బూజ్యత్వ? మేకొంచెమో
అర్వాచీనములందునుం గలవు శ్రద్ధాహంకృతుల్; సద్బుధా
శీర్వాదమ్ముల కొగ్గుఁ గేలు; హనుమత్సేవాసమాసక్తుఁ డ
ప్పార్వత్యంబికకున్ దృతీయసుతుఁడై వర్ధిల్ల దీవించెదన్. ౬౯

చ. ఇతనికి జ్యోతిషమ్మునెడ నింతటి ప్రజ్ఞకుఁ గారణమ్ము దై
వతకృప కొంతసాయ మను వాస్తవ మే గుఱితించినాఁడ నా
కితఁ డిది చెప్పకున్నను నెదే నితరంబు వచించుపట్ల గుం
ఫితమగు మర్మమున్ బయటఁ బెట్టినయట్లయి నేగ్రహించితిన్. ౭౦

క. కలలోనఁ గొన్ని ప్రశ్నము,లకు సదుత్తరము లితనిబుద్ధికిఁ దట్టున్
గలదు మనశ్శక్తికిఁ దో,డలదైవబలమ్ముగూడ నధిక మితనికిన్. ౨౧

క. విద్యావిషయమ్మున నెవఁ,డుద్యోగిగ నుండు వాని కుండెడి విధిగా
సద్యస్ఫూర్తికి నొక దివి,షద్యోగావాప్తి లేదు సందియ మిచ్చోఁ. ౨౨

క. అదియీనాఁటితపస్సం,పద యేయగుఁగొన్ని యెడలమఱి ప్రాగ్భవమం
దుఁదపించినఫల మగున,ట్టిది యిట్టిదిగూడ నగుఁగడిందిగనొకచో. 23

చ. ఎవరికిఁగాని కన్పడక యే యితఁ డెప్పుడు నింట నుండుఁ బోఁ
డెవ రెటు లెంత పిల్చిన మఱేసభ; కియ్యది కొంత చింత్యహే
తువు; నిజ మిట్లుగానియెడఁ దోఁపక యీతని విద్య సారె "ఫే"
లవునఁట? "మాన" మన్ వ్రత మనాదిగ నీదృశులందు నున్న దే.

క. మితభాషిత్వం బెందు సు,కృతమ్మనకు మంచిత్రోవ యిది శేఖరునం
దతికినది బాల్యమాది సు,కృతవిద్యుండయ్యు బైటికి న్నాకుండే. ౨౫

క. హరిబాహుచతుష్టయ మన,వఱలుసుతచతుష్టయమ్ముబలసికొలువ శే
ఖరరాయని సంసరణము,సిరికిరవై దోసఁతోట చెలువున నలరున్ ౨౬

చ. ఒకఁడు కుమారశేఖరుఁ డొక్కరుఁడో జయశేఖరుండు, వా
రకకులశేఖరుం డొకఁడు క్రమ్మఱనొక్కఁడు చంద్రశేఖరుం,
డిఁకఁ గొమిరెల్ జనించుటకు నే నొనరించెద నాశిషంబు; త
ప్పక ఫలియింపఁ జేయ భగవంతుని బ్రార్థనసేతు సారెకున్ ౨౭

క. కమలయు విమలయు నను నల, కమలాక్షులు క్షీరనీరగతిఁగాఁబొరపొ
చ్చెములేవియులేకుండం,గ మెలఁగ శేఖరుడుగడపుఁగాలముసుఖియై.

క. పెండిలికి మున్నె శేఖరు, నండంజేరినది సిరి యనంతర మది తాఁ
గొండొకయభివృద్ధిగొనియ,ఖండముగాఁజొచ్చెలోటుగనరాదెందున్.

క. శ్రీ వృద్ధిఁ జెందఁ గమలా, దేవియు విమలాభిధాన దేవేరియుఁ దన్
సేవించుచుండ శేఖర, రావు సుతులతోడుతన్ గరం బలరారున్.

క. శ్రీవిష్ణువులును నల గా, రీవిశ్వేశ్వరులు గీర్వారించనులు దనుక
గావఁగ సిరితో శేఖర, రావు సతీసుతులతోఁ జిరము వర్ధిలుతక.

క. ఏవిశ్వేశ్వరికతమున, భూవలయమునందుఁ బేరు పొందె నితఁడు తా
నావిశ్వేశ్వరి శేఖర, రావున కిడుఁగాక శుభపరంపర లెపుడుక. ౮౨

క. కోవిదగణ్యం బగుసిరి,తో విజయముతోడ దోసతోఁటయుబలెఁ బెం
పావహిలు కుటుంబముతో, రావు వెలయుఁగాక శేఖరత సార్థకమై.

క. కేవల మీతఁడు విద్యా, జీవనుఁడై కడుఁబ్రసిద్ధిఁ జెంది జమీందా
రై విలసిల్లెడి శేఖర, రావు నదృష్టంబు సుకవిరాణ్నుతి గనదే.

క. రావనుపదంబు నాగరి,కావళి సర్వత్రి గల దనర్థక మది యీ
రావు జమీక్ గానిసార్థక,తావై భవ మబ్బఁజేసెఁదత్పదమునకుక.

క. ఏవాఁ డాగర్భశ్రీ, సేవధి యవ్వానికన్న సిరి తనకుక దా
నైవావిరి నార్జించునొ?, కోవిదు లవ్వాని మెచ్చుకొందురు పేర్మిక.

చ. ఇతఁ డటువంటివాఁ, డితని కే తలిదండ్రిలు నన్న లాస్తు లే
యితరులు పంచి యిచ్చినది యేలవలేశము లేదు, శైశవం
బుతటి సహోదరుం డెలమిఁ బోషణఁజేయుచు విద్య కిచ్చె నం
చితునిగ జాతకంపుఁగళఁజేసి మహోన్నతిఁ గూర్చెఁ బేర్చుచుక.

ఉ. "యూరపు" ఖండదేశముల నుండిన నుందురుగాక యీదృశో
దారతరప్రయోజకులు, తథ్యము భారతదేశమందెటక
లేరని చెప్పఁగోఁగ లవలేశము సందియ ముండ దీజమీం
దారుఁడు శేఖరుండు సిరి తామరతంపరగా నెసంగుతక. ౮౮

క. అంతర్ముఖుఁడై యెపు డే
కాంతమ్మగ నుండు నితనియాథార్థ్యము నేఁ
గొంత యెఱుంగుదుఁ గడు ధీ
మంతుఁడు శేఖరుఁడు చిరము మనియెడుఁ గాతక. ౮౯

క. ఇతఁడతిశయోక్తి కొప్పఁడు,మతి నాయది దానియందు మసలదు నేనీ
కృతిలోనక్కతననలం, కృతికిందావాసఁగలేదుకృతులెఱుఁగఁదగున్.

ఉ. ఒక్కటిమాత్రి మున్నయది యున్నది యున్నటులే లిఖింతుఁగా
కిక్కృతిలోన నే; నితని నెన్నఁ డెఱుంగనివారి కందులో
నిక్కము గానరామిఁ గవినిర్మితఫక్కిఁగఁ దోపవచ్చు నే
నక్కతనం బ్రితారకుఁడనై నిజ మేగతి డాఁచి వ్రాయుదున్. ౯౧

క. "బందరు"లో "నేలూ" ర్పుర
మందున్ మఱికొన్నిచోట్ల నలఘులు "ప్రొఫెసర్"
చందం బెఱుఁగుదురుగదా?
సందేహం బేల? యున్నచందము తెలుపన్. ౯౨

క. కృతితో సతీసుతులతో, ఋతమగు వర్తనముతో సిరికిఁ దావగుజీ
వితచారిత్రిముతో దాతృతతో శేఖరుఁడు చిరము శ్రీ గనుఁగాతన్.

శ్లో. రవ్యాదయో గ్రహేశానాః అశ్విన్యాద్యాశ్చ తారకాః
జ్యోతిర్విద్యాకుశలినం, పాయాసు సోమశేఖరమ్. ౯౪

—♦ గద్య ♦—

ఇది శ్రీ తిరుపతి వేంకటేయమ్మగు పతివ్రత యను
ప్రబంధమ్మునందు సర్వమ్మును
జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సమస్త సన్మంగళాని భవంతు.

---